# అరుంధతీ వసిష్ఠము

బులుసు వేంకటేశ్వరులు



ప్రచురణ

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

# అరుంధతీ వసిష్ఠము

రచయిత
బులుసు వేంకటేశ్వరులు




ప్రచురణ

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి
2007

**ARUNDHATHI VASISTHAMU**
By
**BULUSU VENKATESWARLU**

T.T.D. Religious Publications Series No. : 702



T.T.D First Edition : 2007

Copies 1000

***Published by***
**Sri A.P.V. Narayana Sarma,** I.A.S.,
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati - 517 501.

***DTP by***
M/s. SAR Infotec (P) Ltd,
15-3-200, G.N. Mada Street,
Tirupati - 517 501.

***Printed at***
Tirumala Tirupati Devasthanams Press,
Tirupati - 517 507.

# ముందుమాట

సప్తర్షిమండలంలో అరుంధతీ వసిష్ఠులకు విశిష్టస్థానం వుంది. హైందవ ధర్మంలో వివాహానంతరం వధూవరులచేత ఆదర్శదంపతులుగా దర్శింపబడుతూ దేదీప్యమానంగా ప్రకాశిస్తున్నవారు అరుంధతీ వసిష్ఠులు. అందువల్లే వసిష్ఠ మహర్షి ఋషి ప్రపంచంలో ఉన్నతుడుగాను, అలాగే పరమపతివ్రతా శిరోమణిగా అరుంధతీదేవి సర్వలోకాల చేత కీర్తింప బడుతున్నారు. ఆ దివ్య దంపతుల జననము, వివాహము మొదలైన ఘట్టాలను పద్యకావ్యముగా, సరళమైన శైలిలో సుప్రసిద్ధ పండితులు బులుసు వేంకటేశ్వరులు గారు రచించడం సర్వపాపహరణం, సర్వ శ్రేయస్కరం కూడా.

తిరుమల తిరుపతి దేవస్థానములు నిర్వహిస్తున్న ధర్మ ప్రచార కార్యక్రమములో భాగంగా అనేక ధార్మిక సాహిత్య, సాంస్కృతిక గ్రంథాలు ప్రచురించబడుతున్నాయి. అదే కోవలోనికి చెందిన ఈ అరుంధతీ వసిష్ఠ పద్యకావ్యాన్ని పాఠకులు అందుకొని ఆస్వాదించగలరని ఆశిస్తున్నాను.

కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

# ఉపోద్ఘాతము

ధర్మాంతరములతో కానరాకుండ సాగిపోవుచున్న యీ విప్లవ సమయమున, విశేషించి స్త్రీస్వాతంత్ర్యము రూపొందింపబడుచున్న వర్తమాన సమయమున ఈ కబ్బము కొందఱకు ఆశ్చర్యమును కలిగింపవచ్చును. కొందఱకు ప్రాతలే రుచి. కొందఱకు క్రొత్తలే రుచి. మఱి కొందఱకు ప్రాతక్రొత్తల కలగలుపే రుచి. పరిణామమునకు నానారూపత స్వభావమైన చందముగనే అభిరుచులకును నానావిధత్వము స్వభావమగుట వింతకాదు. కావున కొందఱు కవులు తమకావ్యములందు పురాణమార్గమునే స్వీకరించుచున్నారు. మఱి కొందఱు నవీనమార్గమును, ఇంక కొందరు ఉభయమును, వేఱు కొందరు అతినవ్యమార్గమును పట్టుకొని పోవుచున్నారు.

బులుసువారింట బుట్టిన యీ కవిమాత్రము తత్త్వమును ధర్మమును ఋషులను బట్టుకొని ప్రాకుట పాడియే. ఈ కవి కళానుభూతిలో నాయికలును నాయకులును అత్యంతము ప్రాకృత శృంగార రసాదులచే భావితులు కారు. వీరి చూపు వేఱు. వీరి యీ పేటిమిలో ధర్మము ననుగమించిన అర్థకామములకును, అర్థకామములను ఉంచవలసిన స్థితిలో నుంచుధర్మమునకును విలువ. ఈ కబ్బమున ఆత్మానుభవమున కంగమగు గార్హస్థ్యధర్మము ధర్మవీరమై అద్భుతమై తాడియెత్తున కానుపించును.

# కథా సంగ్రహము

ఈ కబ్బమున కర్దమ ప్రజాపతి కన్యాదాత. పెండ్లికూతురు అందఱకును పెండ్లిచేయించు అరుంధతి. పెండ్లికొడుకు వశిష్ఠుడు. పెండ్లికి పూర్వరంగము చూపులకు వసిష్ఠుడు వచ్చి ఇంత ఇసుక తీసికొనివచ్చి వంటచేసి పెట్టగలవా? అని పెండ్లికూతును పరీక్షచేయును. ఆమె షడ్రసోపేతముగా వంటచేసి పెట్టును. పిదప వసిష్ఠుడు గంగాజలపూరిత మగు తన కమండలువు ఇచ్చి నేను వచ్చు దనుక దీనిని పట్టుకొని యుండుమని వెళ్ళిపోవును. కమండలువును పట్టుకొని ఆమె యట్టులే నిట్టనిలుచును. ఏండ్లుఃబూండ్లు గడచును. వారునువీరును తల్లిదండ్రులును తుదకు బ్రహ్మయు వచ్చి కమండలువును విడచి లోనికి రమ్మని చెప్పుదురు. ఊహూ. ఆ మాట లామె చెవికి సోకవు. తుదకు పెండ్లికొడుకే వచ్చి నా కమండలువు నాకిమ్మనును. ఆమె యిచ్చును. వసిష్ఠుడు తనకుండికను గ్రహించుటతో పాణిగ్రహణము జరుగును. పిదప అరుంధతితో వసిష్ఠుడు తనయాశ్రమమున కేగును. అతడచట ఆమెకు తన శిష్యులను సాకుమెలపు, తపస్సులో నుండి తనకు సేవ చేయుతీరు గోసేవ చేయుతెఱగు భూతములకు ప్రీతి చేయురీతి యీ మొదలగునవి నేర్పి తాను తపస్సులో మునిగిపోవును.

వసిష్ఠుడు దీర్ఘమగు తపస్సుచే రజస్తమో మలాపేత మగు బుద్ధిసత్త్వ ముద్దీపింపగా శక్తివడయును. అరుంధతియు గోబ్రాహ్మణుల సేవ చేసి భూతతృప్తి యొనరించి పతిని శుశ్రూషించి ఫలాభిసంధి లేని కర్మలోనిమర్మ మెఱిగికొనును. పదపడి వారు ప్రజాతంతువును పొడిగింతురు. పలువురు పుత్రులగని ప్రకృతి పరిణామక్రమమును పరిసమాప్తి యొనరింప వానప్రస్థము చేకొన దలతురు.

వసిష్ఠుడు గుణపరిణామ క్రమ సమాప్తి కెదురు చూచుచు ఒకనదీతీరమున వానప్రస్థము స్వీకరించును. అవలియొడ్డున అగస్త్యుడు వాయుభక్షణము చేయుచు మౌనియై తపస్సొనర్చుట వినును. అరుంధతితో నేగి అతని దర్శించి దైనందినమును తమ ఆతిథ్యమును స్వీకరింప బ్రార్థించును. అతడంగీకరించును. అది మొదలు అరుంధతి షడ్రసోపేత మగు బోనము నతని కొసగి వచ్చి అందు మిగులును వసిష్ఠున కిడును. తద్భుక్తశేషము తాగొనును. ఇటులు జరుగుచుండగా ఒకనాడు నదికి వఱద తగులును. ఆమె వెను దిరిగి వచ్చి వసిష్ఠునకు విన్నవింపగా నతడు – 'నన్ను సదా బ్రహ్మచారి పంపుచున్నాడు, దారి యిమ్మని కోరు' మని చెప్పి పంపును. ఆమె మరల పయనించి వసిష్ఠుని ఉబుసు చెప్పును. నది తెరువొసగును. ఆమె అగస్త్యుని కోగిర మిడి 'అయ్యా! ఈనది ఒడ్డుపొరలి పాఱుచున్నది, నాకు దారి ఎటులు' ? అని అడుగును. అగస్త్యుడు మౌనము విడిచి – 'నీ విపుడెట్లు రాగలిగితివి' అని అడుగును. ఆమె తనభర్తబాస చెప్పును. అతడు చిర్నగవుతో – 'నన్ను నిత్యోపవాసి పంచె' నని తెల్పి పొమ్మనును.

ఆమె అటులే తెల్పగా నది పాయ యిచ్చును. ఆమె తమ యాశ్రమమునకు వచ్చి యూచిత్రవృత్తాంతమును చెప్పి – ' అయ్యా! తమకు నూఱుగురు కొడుకులు! మీరు సదాబ్రహ్మచారు లగుట యెటులు? మన మిచటికి వచ్చిన దాది అగస్త్యుడు నిత్యభోజికదా! అతడు నిత్యోపవాసి యెటులు' అని అడుగును. వసిష్ఠుడు – ధర్మమునకు అంగముగా కామమును సేవించు భ్రాంతిహీనుడు సదా బ్రహ్మచారి, అన్న మబ్బినను అబ్బకున్నను సమముగా నుండువాడు నిత్యోపవాసి అని చెప్పును. అది ఆ కాలమునందలి గార్హస్థ్యమునకు ఆదర్శము.

ఈ ఆదర్శము చొప్పున జరపు జీవనమునకు పునాది ధర్మము. అర్థకామములు దానికి అంగములు. అందు నిగ్రహముతో కూడినది

భోగము. అది అపవర్గమునకు సోపానము. ఆ భోగమునకు ఫలము సుప్రజ. అట్టిసుప్రజ మానవ యోగక్షేమ సంపాదకము. ఆ జీవనమునకు ఫలము అపునరావృత్తి. వర్తమానకాలమందలి గృహస్థుల కామముగూడ బహుముఖము కాదుగాని ఉద్దామము. మఱి భోగమే దీనిహృదయము. మఱియు ఆ భోగమునకు తృప్తిలేని ఆకలి. దీనికి ప్రజామాత్రము ఫలము. ఆ ప్రజ సమాజసువ్యవస్థా సమర్థము కానిది. ఈ భోగమువలన సుఖము, దాన రాగము, దాన మరల భోగము, ఈరీతిగా ఇది షడరవంగు సంసారచక్రము లేక విషచక్రమునేర్పఱచును. ఈ ఆదర్శము చొప్పున జరగిపోవు జీవనమునకు ఫలము పుట్టుట గిట్టుట, గిట్టుట పుట్టుట – 'జాయస్వ మ్రియస్వ.'

సరియ. తొలి యాదర్శము నెవరేని యీకాలమునను అవేర్పగలరా? ఇసుక నెవరేని వండి తినిపింపగలరా? అటులగుచో ధాన్యము పండింప నక్కఱలేదే! లోకమంతయు గగ్గోలు పెట్టునంత కాలము ఏ హిడింబయైనను మగడిచ్చిన వస్తువుగొని నిలుచుండగలదా? అటులు వీలగుచో యంత్ర సాహాయ్య మక్కఱలేదే! 'నన్ను సదా బ్రహ్మచారి పంపెను, నిత్యోపవాసి పంపెను' అని చెప్పునంత, నిండుటేఱు కాలి తడి కాకుండ దాటనిచ్చునా? దాటనిచ్చుచో పడవలతో పనియుండదే! అని యంత్రుకాని నిస్సారమైన పదార్థములనైనను రుచికలుగునటులు వండనేర్చుటయు అతిథ్యభ్యాగతులకును భూతములకును తృప్తియొదవ పెట్టనేర్చుటయు, గోసేవయు, పతి సేవయు చేయనేర్చి యుండుటయకాక ప్రజలకొఱకే గృహమేధిత్వమని యెఱిగి యింద్రియ జయ మొనరించి భగవదారాధనముచేసి తరించుట భార్యకును, ఆముష్మికమున కనుకూలమగు ఐహిక సామగ్రి వడసి యింద్రియములు జయించి తపముచే సత్త్వముగా నిలిచి ప్రజాతంతువును త్రెంపక పదపడి వాన ప్రస్థము గొని బ్రహ్మభావనతో

తరించుట భర్తకును ఆదర్శమనియు ఇదియ ఆదర్శ గార్హ స్థ్య మనియు ఈ కథకు వ్యంగ్యము.

వివాహమునకు సుప్రజయే ప్రయోజకము. శాస్త్రము చెప్పిన చొప్పుననున్న వధూవరుల వివాహము వలననే సత్‌సంతానముకలుగును. కామమూలకమగు స్వైర వివాహము దానికి సమర్థకము కాదు. విహిత వివాహముచేతనే పతిపత్నీభావ మేర్పడునుకాని స్వైర వివాహము వలన ఏర్పడదు. పతిపత్న్యుత్పాదకమును సప్తపద్యంతమును అగు కర్మకలాపమే వివాహము. కామము వివాహాంగము. పుత్రు డుండగా వానప్రస్థుడై పురుషుడు మఱొక ఆలిని గొనుట కేవలము కామమే. ఆశ్రమాంతరమునకు యోగ్యతలేనిచో – 'అనాశ్రమీ' అను న్యాయముచే గృహస్థాశ్రమమునందే యుండుటకు భార్యాంతరమును చేకొననగును. ఈ విధి రామ భీష్మాదుల వంటి మహాత్ముల యెడ బ్రవర్తింపదని కాళిదాసాదులు, ప్రవర్తించునని కుమారిలాదులు. ఇది శాస్త్రమర్యాద.

'కామాత్మతా న ప్రశస్తా నచై వేహా స్త్యకామతా'.

అని మనువు. ఇట్టియాదర్శమును ఋషులు మనకు అనుష్ఠించి చూపిరి. ధర్మశాస్త్రము ఈ యాదర్శమునే విధించెను. కవులీయాదర్శమునే వ్యక్త మొనరించిరి. శ్రీబులుసు వేంకటేశ్వర్లుగారు తమ కబ్బమున దానినే ఎడనెడ వాచ్యముగను లక్ష్యముగను వ్యంగ్యముగను చూపిరి.

ఈ కబ్బమంతయు ప్రసాదగుణము చిప్పిలుచు ఒక పద్యము నుండి మరి యొక పద్యము తీగవలెసాగి పోవును. కథా శరీర ముజ్జ్వలమై భావుకులకు కౌతుకమాపాదించును. ఇందు వర్ణింప బడిన ఆశ్రమాదులను చదువుచున్నప్పుడు అవి పాఠకుల మానసములముందు ప్రత్యక్షమగును. అరుంధతీ వసిష్ఠుల గృహప్రవేశము, వసిష్ఠుని తపస్సు నీ కవి ఎన్నిపద్యము

లలో ఎంత రమణీయముగ చెప్పెనో ఆపద్యములను కంఠస్థముచేసి అప్పగింప వలసినదే.

ఇట్టి కవితాసామగ్రితో వెలయు నీ అరుంధతీ వసిష్ఠము రూపమున అరుంధతి యయ్యు గుణమున వసిష్ఠము. దాంపత్య జీవన మారంభింప బోవు ముందు కన్నులలో అరుంధతీ వసిష్ఠు లలరింప బడినట్లు వధూవరుల చేతులలో వాతులలో నీ కబ్బము లాలింపబడ దగినది.

వేలూరి శివరామశాస్త్రి

శతావధాని

# అరుంధతీవసిష్ఠము

## పీఠిక

శ్రీమహనీయరూపుఁడు వశీకృతచిత్తుఁడు నిర్జితేంద్రియ
గ్రాముఁడు సిద్ధసాధనుఁడుకర్మరహస్యవిదుండు జ్ఞాన తే
జోమయుఁ డార్యపూజితుఁడు సూనృతనిష్ఠుఁడు యోగివర్యుఁడౌ
మామకసద్గురూ త్తముని మానితరూపము నాత్మ నిల్పెదన్. 1

కొలిచినవారి కెల్లరకుఁ గోరిక లిచ్చెడుకల్పవృక్షమై
తలఁచినవారి నెల్లరను ధన్యులఁజేసెడుయోగమూర్తియై
తెలచెడువారి నెల్లరను దివ్యులఁజేసెడు జ్ఞానరాశియై
విలసిలు మద్గురూత్తముని విశ్రుతపాదము లాశ్రయించెదన్.2

నిష్కామప్రభుతాత్ముఁడై వెలయుచున్ నిత్యోత్సవశ్రీమహా
విష్కారంబున నెల్లవారలను దృప్తింబొందఁగాఁజేయుచున్
నిష్కామక్రియమాణసంతతమహానిర్నిద్రసంచారియై
దుష్కామాంతకుఁడైన మద్గురుని గొల్తున్ సర్వసంసిద్ధికిన్. 3

గురుసంపూజన మాచరింపఁగలఁభక్తుండౌను శక్తుండు మో
క్షరమన్ జేకొన, గుర్వనుగ్రహమె యౌఁగామ్యార్థసంసిద్ధిఁస
త్వరమార్గంబు, గురుం డనంగ శివుఁడే తథ్యంబు కానన్ మహే
శ్వరుఁడౌ మద్గురుదేవు నిత్యమును సంభావింతు భక్త్యున్నతిన్.4

గురుకృప మున్నుఁగావ్యములఁగూర్చితి జేర్చితిఁ దత్పవిత్రతఁస
చ్చరణపయోజమూలమున జన్మము ధన్యము గాఁగ నింక నొం

డరసి రచింతుఁగావ్యము గృపాంబుధి నాతని బూజచేయఁగా
దొరఁకొని, దైవపూజకును దోయజసంతతి కెక్కుడున్నదే? 5

కావ్యంబు పరమార్థకారణం బనియును
నది గురూ త్తమునకు నంకిత మని
గురుదేవసంసేవ పరమౌషధం బగు
భవరోగముల కన్న భావముననుు
బుద్ధివికారముల్ పొడమకుండుటకు స
త్కాలవ్యయంబె మార్గం బనియును
సరససారస్వతఁవరివస్య యనియును
మిత్రవాంఛను దీర్ప మేలగు నని
బాహ్యహేతువు లిన్నిటి బాఱఁద్రోలు
గురుకటాక్షము నాపైనిఁబరగి యిట్టు
లీ సపర్యను గొనఁగ విలాస మనియుఁ
గావ్యము రచింప దొరఁకొంటి భవ్యముగను. 6

సర్వగీర్వాణకవుల కంజలి ఘటించి
నన్నయను దిక్కనను గొల్చి యున్న పెక్కు
రాంధ్రకవులకు భక్తి జోహారు లొసఁగి
వాక్పవిత్రతఁబడసి కావ్యం బొనర్తు. 7

" కవితావస్తు వరుంధతీఘటజఁలోక శ్రేష్ఠవృత్తాంతమై
చవు లూరించుఁబదింబదిం జదువ; శశ్వత్పుణ్యసంవర్ధకం

బవు విన్నన్ దలపోయ మెచ్చు, నీcక భాగ్యంబున్నె వేఱొండు స
త్కవికావ్యంబుc బఠించుకంటె '' నని విఖ్యాతిన్ జనం బెంచుతన్.8

చిరకాలంబు ధనాధికారములకై సేవించి క్షుద్రాత్ముcద
త్పరతన్ మానవుcడల్పబుద్ధి నవి సంప్రాప్తింప జీవించి, యీ
ధరపైc బేరును బెంపుcగాని జనికిన్ ధన్యత్వముం గాని మో
క్షరమన్ గైకొనుబుద్ధిcగాని గనకే చచ్చున్ వృథాజన్ముcడై. 9

జననపరంపరాంబుధిని జక్కcదరింపcగ నుద్యమించి సా
ధనఘనసిద్ధిc గాంచుట ముదంబొ వ్యథామయ మోహవాగురన్
బెనcగొనిస్రుక్కుటల్ సుఖమొ నిక్క మెఱుంగరు మూఢమానవుల్
వినుతవివేకు లెంతయును లెస్స గడింతురు జ్ఞానసంపదన్. 10

ప్రాచీనార్యఋషీశ్వరుల్ మును పరబ్రహ్మంబుc బ్రాపించి య
ర్వాచీనప్రజకున్ మహోపకృతిగాcబ్రజ్ఞానతత్త్వంబులన్
సూచింపంగcదదీయసచ్చరితముల్ సూక్ష్మంబుగాcజూచినన్
బ్రాచుర్యం బగు జ్ఞానతత్త్వమని సంభావింతు నేతత్కథల్. 11

తలపోయం దరమే వసిష్ఠుని మహత్త్వం బేరికైనన్! ; దదం
ఘ్రులు సేవించి మహాపతివ్రత యనన్ లోకంబులన్ దివ్యకీ
ర్తుల వెల్గొందు నరుంధతీసతి నహో! స్తోత్రింపcగా శక్యమే?
పలుకుల్ వేయును నేల వారిస్మృతియే భాగ్యంబు లోకాళికిన్.12

గురుకృపకల్మి వారినిటు కోరి స్మరించెడిభాగ్యమబ్బె , స
ద్గురుకృప కీడు లేదు; పరితోషము కల్గదు వేఱొకంట. ను

ద్గురువరుపూర్ణసత్కృపకు దోయిలిపట్టెద భక్తితో నిరం
తరమును; దాన నీగెద వ్యథల్ చరితార్థతఁ గాంచ జన్మమున్.13

" కవితాకన్య వరించియుండు టొకభాగ్యం "; బంధుమిత్రుల్ సదా
కవితాకన్యక నుత్తమర్షిజనసద్గాథా ప్రకారంబులన్
మివులన్ దన్పుట భాగ్య; మా తరుణి నున్మేషంబునన్ సద్గురు
ప్రవరశ్రీపదసేవ నిల్పుట మహాభాగ్యంబు నిక్కంబుగన్." 14

కవి యయి సత్కథాగణముఖంబునఁ దత్త్వదధిన్ మథించి యిం
పవు నవనీతమున్ బ్రజలకందఱ కందగఁ జేసి జన్మమృ
త్యువుల జయింప నెల్లరకుఁదోడ్పడఁగావలెఁగానిఁ యాజవం
జవమునఁగూల్చి కాల్చు విరసం బగుగాథల వ్రాయఁజెల్లునే?

రసికులు వారె సర్వగుణరక్తులు వారె విరక్తచిత్తులై
యెసఁగినపుణ్యమూర్తులును నెన్నఁగ వారె విరాగరాగులై
విసముననే మహామృతము పిండినవారును వారె యట్టి తా
పస రసికావతంసులను భక్తిఁదలంచెద జ్ఞానభిక్షకై. 16

## షష్ఠ్యంతవములు

ముక్తిసతీనవయౌవన
రక్తుని సుజ్ఞానభక్తిరమణీయోగా
సక్తర్షిప్రవరు యథా
శక్తిని స్మరియింతు గురుని షష్ఠ్యంతములన్. 17

కమనీయాద్భుతరూపున
కమలప్రజ్ఞానచక్షుఁడౌ పుణ్యునకున్
కమలాసనకమలాప్రియ
కమనీయ కపాలపాణి కారుణ్యునకున్. 18

ఆత్మేంద్రియనిగ్రహ స
ర్వాత్మునకున్ గామకామహర్యక్షునకున్
ఆత్మీయశిష్యగణ పర
మాత్మునకున్ సతతపరమహర్షాంబుధికిన్. 19

కరుణాకర పరమాదర
సరసాలాపప్రకార సర్వజ్ఞునకున్
నరనారాయణ పరమే
శ్వరమూర్తికిఁ బ్రాపు ప్రోపు భగవంతునకున్. 20

శిష్యశ్రీశైలమహా
ముష్యాయణగిరికి స్పర్శముఖవేదికి సం
పోష్యబహుశిష్యయుతునకు
ఋష్యగ్రణి కఖిలవిబుధఋషభంబునకున్. 21

జ్ఞానాబ్ధిశీతకిరణున
కానందసుధాప్రవర్షకాంబుదమునకున్
నానాగమసారామృత
పానంబున విఱ్ఱవీఁగు బ్రహ్మణ్యునకున్. 22

పట్టం బగ్గము లేకయె
నట్టడవిని నింగి వేల్పునగరులలోనన్
ముట్టక యంటక చను జగ
జెట్టికిఁ బుట్టువుల నీగుసిరిమానిసికిన్. 23

తెలుపుల మేటికిఁ బలికిన
పలుకులఁ దీనియలు జాలువాఱించెడి ని
చ్చలపుం దలిసికొలంబున
బలుప్రోడగఁ బుట్టుగొన్న బమ్మరుసికినిన్. 24

అంకితంబుగా మదభ్యుదయపరంపరాభివృద్ధినిమిత్తంబుగా నే నొనర్పంబూనిన "అరుంధతీవసిష్ఠము" నకు గథాక్రమ మెట్టి దనిన

.......

# ప్రథమాశ్వాసము

## కథాప్రారంభము

శ్రీకమలాసనుండు మును సృష్టిని వృద్ధి యొనర్పఁగోరి య
స్తోకముదంబునన్ హృదయ తోయరుహంబున నుండి బ్రహ్మతే
జోకుటిలాత్మవిగ్రహుల సుస్థిరచిత్తులఁబావనాత్మ సు
శ్లోకుల సృష్టిచేసె నవసుందరదేహుల బ్రహ్మనిష్ఠులన్. 26

యోగసమాధియుక్తము మహోజ్జ్వలమైన తపోవిశేషమున్
ద్యాగవిరక్తి యుక్తమును ధన్యము నౌ నిజదేహ మిచ్చి నా
నాగమవిజ్ఞతాబల మనంతముగాఁగ ననుగ్రహించి తే
జోగరిమం బొసంగి కృపఁజూచెను వారల నవ్విరించియున్. 27

వారలలోన నెన్న సరివారలె లేని తపోమహత్త్వ వి
స్ఫారుఁడు రూపమన్మథుఁడు పంకజనాభు ననుంగునై జగ
ద్భారము సృష్టిభారమును దాల్చి ప్రజాపతి నాఁగ ఖ్యాతిఁబెం
పారిన సత్త్వపోధనుఁడు భవ్యుఁడు కర్దమమౌని యొప్పెడున్. 28

అతఁడు సరస్వతీతటమునందలి దివ్యవనప్రదేశ సం
స్థితి బహువత్సరంబులు విశేషతపం బొనరించె, నంత నం

చితముగ విష్ణుమూర్తికృప చేసెను దర్శన మిచ్చి దుర్ధమ
వ్రత తనుమర్దన ప్రబలవర్ధన విజ్ఞాని కర్దమర్షినిన్. 29

ఆ పరమాత్ముకటాక్షము
ప్రాపింపఁగ భక్తియుక్తి భయసాధ్వస శో
భాపరవశుఁడై పలికెను
గాపట్య మొకింత లేనిఘనభక్తిహృదిన్. 30

"పరమేశ! నీకృపఁబడయఁగల్గెడివాఁడె
బ్రతుకుఫలంబును బడయువాఁడు
పుండరీకాక్ష! నీపా ల్పొటింగెడివాఁడె
బ్రహ్మప్రబోధంబుఁబడయువాఁడు
లక్ష్మీశ! నిఁన్నుపలక్షింపఁగలవాఁడె
పరమేశ్వరుం డయి పరగువాఁడు
పద్మప్రియా! నిన్ను భావింపఁగలవాఁడె
తాఁ బరబ్రహ్మమై తనరువాఁడు
ఆదిపూరుష! నిన్ను నే నరయఁగంటి
భక్తవత్సల నిన్ను నేఁబడయఁగంటి
ధన్యమయ్యెను మజ్జని తావకీన
దివ్యదర్శనభాగ్యసందీప్తికతన. 31

శరణంబందెదఁ ద్వత్పద
సరసీరుహయుగిని జేరి సమ్యక్కృప న

న్నరయుము నీ వానిగ నో
పరమాత్మా! దేవదేవ! భవభయదూరా! 32

ఏ యుగమ్మునసైన నిందిరారమణ! నిన్
దలపోయుటే ఘోరతపము కాదె?
అంబుజోదర! నిన్నె యర్చించుటే కదా
యోగఫలంబును ద్యాగఫలము
కమలదళాక్ష! సంయమిలోకసామ్రాజ్య
పట్టభద్రత భవద్వందనంబు
లోకేశ! ని న్నుపశ్లోకించుటే బ్రహ్మ
నిర్వాణపద మగు నిశ్చయంబు
గరుడవాహన! కౌస్తుభాభరణ! శంఖ
చక్రధారణ! నిన్గని సఫలమయ్యె
మామకీనభవంబు , రమ్య త్వదీయ
రూపదర్శన మొసఁగు సారూప్యఫలము." 33

అని పెక్కుగతుల నాతఁడు
వినుతింపఁగ విష్ణుమూర్తి ప్రియమున "వత్సా!
ననుఁదలఁచినకార్యం బే "
మని యడిగినఁ గర్దమర్షి యనె భక్తి మెయిన్. 34

" దేవదేవ! యెఱుంగవె? నీవు సర్వ
మేను బలుకంగ వినుట నీ కిచ్చయయ్యె

నేని పలుకుదుఁ బలికింప నీవు తండ్రి!
అవ్యయానందసంధాయకాగ్రగణ్య! 35

నలువ సృష్టించి యాత్మనందనుల; వారి
జీవసంతతి సృష్టింపఁజేసె నాజ్ఞ ;
ఆ నియోగిజనంబు లధ్యాత్మచింత
మునిఁగియుండంగఁగోపించి యనియె నలువ. 36

'ఈ నియోగిజనంబులు నా నియోగ
మేమఱిరి; సృష్టికార్య మిం కేమిగాను?
పరమపాపులు పట్టి నిర్భాగ్యులైరి
గోముఖవ్యాఘ్రము' లటంచుఁ గోపపడఁగ. 37

వార లాతని శాపంబు బారిఁ బడఁగ
నిచ్చగింపక పెండ్లాడి సృష్టికార్య
నిర్వహణులైరి ; మఱి నేను నీరజాక్ష!
నీ యభిమతంబుఁదెలియంగ నిశ్చయించి. 38

తప మొనరించితి దేవా!
కృపచూపితి వీవు నన్నుఁ గించిద్జ్ఞుని నీ
సుపదంబు లాశ్రయించిన
కృపణుని న న్ననికరించి యి మ్మాజ్ఞ ప్రభూ! 39

నలసారం బగుసంసృతిం బడి యనంతా! కామలోభాదికం
బులచేతన్ హతులై నశింతు రహ! కొమ్ముల్ మొల్చువారైన; నీ

విలసత్పాదము లాశ్రయించియె మహావిజ్ఞానపుంబల్మి ని
చ్చలుఁ గావించెద జీవయాత్ర నతినిష్కామంబునన్ శ్రీహరీ! 40

అని విన్న వించుకర్దముఁ
గనుగొని "మునిచంద్రమా! యకల్మషమగు నీ
ఘనచిత్తవృత్తి యెఱుఁగుదుఁ
బనిగొనుమా బ్రహ్మ యాజ్ఞ భద్రంబు లగున్. 41

స్వాయంభువమను పుత్త్రిక
నీయం దనురాగ మూని నెగడును దానిన్
జాయంగాఁ గైకొను మది
శ్రేయం బగు నీకు మౌనిశేఖర! మఱియున్. 42

సౌందర్యసౌజన్యసౌభాగ్యసంపదా
స్పద లౌచు నుత్తమచరిత లగుచు
త్రిభువనఖ్యాతలై దివ్యర్షి చంద్రముః
పాణిగృహీతలై భవ్య లగుచు
పరమపతివ్రతాతరుణీలలామలై
యుత్తమబహుపుత్త్రయోగ్య లగుచు
అన్వయాలంకార లై సాధువర్తన
లోకకల్యాణసుశ్లోక లగుచు
వెలయఁ గలయట్టి తొమ్మండ్రులలన లుద్భ
వింపఁ గలరు భవద్వీర్యవిలసిత యగు

ధర్మపత్నికిఁ బిదప నుత్తమమునీంద్ర!
నేన జన్మింతు సుతుఁడనై నిక్కువముగ. 43

నాయందె మనసు నిల్పుము
నాయం దర్పింపు మఖిలనాథుడ ననుచున్
నీయజ్ఞఫలాదికమును
మాయాతిమిరంబుఁజీల్చి మహితవివేకా! 44

చావుఁ బుట్టువు లెఱుఁగని జాణ నయ్యు
నిన్ను నీజాయఁద్రోవఁగా, నిలుప సాంఖ్య
తత్త్వము జగంబునన్ నాకుఁదలపు కలుగ
నాత్మలీలార్థమై పుట్టు వందఁగలను." 45

అని విష్ణుప్రభు వాత్మధామమున కత్యాశ్చర్యలీలన్ఁసుప
ర్ణునిపై నెక్కి చనెన్ క్షణాన మునిశార్దూలుండు నౌ కర్దముం
డనఘాత్ముండు ప్రియంబునం జనియె బ్రహ్మానందనిష్యందమై
చనుసద్బిందుసర స్తటంబునఁ దపశ్చర్యాదికర్మార్థమై. 46

అంతం గర్దమమౌని యంచిత తపోధ్యానానురక్తుండు ని
శ్చింతస్వాంతుఁడు బ్రహ్మచర్యనియమశ్రేష్ఠుండు సర్వేశ్వరా

నంతప్రాభవదృగ్విలాసుఁడు జగన్నాథార్చనాంతర్య వే
దాంతజ్ఞాన కృశాంగసుందరుఁడుబ్రహ్మానందియై యుండ గన్. 47

స్వాయంభువమను వాత్మ
ప్రేయసి శతరూపతోడఁ బ్రియకామగుణ
శ్రీయుత యగునాత్మజతో
నాయెడ కేతెంచి మ్రొక్కె నతిభక్తిమెయిన్. 48

మ్రొక్కినయంతఁ గర్దముఁడు మోదముతోడ బహూకరించి పెం
పెక్కినయాతిథేయమున నెంతయు వారికిఁ బ్రీతిగూర్చియున్
మక్కువ నాదరించె మను మాన్యుని సర్వసపర్యలన్, గనన్
దక్కువయే మునీంద్రులకు ధార్మికరక్తియు భక్తియుక్తియున్!

కర్దమునిఁగాంచి యానందకలితుఁడగుచు
బలికె స్వాయంభువుండు సభక్తికముగ
వినయగౌరవభావంబు విశదపడఁగ,
చల్లకును వచ్చి ముంత దాఁచుఁడు వివేకి. 50

"వరయోగీశ్వర! దేవహూతి యను శోభారాశి మత్పుత్రి నీ
కరకాంక్షన్ జనుదెంచియున్నది కనంగా నొల్ల దేమానవున్

వర మీవే కృప నీమెఁ గైకొనఁగ సర్వశ్రేష్ఠుఁడౌ భర్త వీ
తరుణీ శ్రేష్ఠకు, నింక నీ వొసఁగు మోదంబంది యామోదమున్." 51

అని వేఁడుకొనఁగఁ గర్దమ
ముని తొలుతటి విష్ణువాక్యమును స్మరియింపం
గని యిది లలాటలిఖితం
బని,తెలిపెను వినయగరిమ నామోదంబున్. 52

తెలిపి "మనువర్య! సమయము కల దొకండు
నాకు నీపుత్త్రివలన సంతతి జనించు
వఱకు నిలిచెద గార్హస్థ్యపథమునందుఁ
బిదపఁగైకొందు సన్న్యాసవృత్తి నేను. 53

పడఁతియును నీవు నిటు లొడంబడితిరేని
భవ్యగుణవతి యైన యీ భాగ్యరాశిఁ
గైకొనఁగ నాకుఁబ్రీతియే నాకుఁ దెలుపు
యుష్మదభిమత" మని పల్కె యోగ్యభంగి. 54

సతితలఁపు తనదుతలఁపును
సుతతలఁపును నొక్కభంగి సొంపలరుటచే

మతి సంతసించి యాశా
లత చిగిరింపంగ ననెఁగెలంకుల మనువున్. 55

మౌనివతంస! నీ పలుకు మాకు మహాసుఖసిద్ధిఁగూర్చె నెం
దేని పవిత్రవిప్రులకు నిట్టి వ్రతంబె యనారతంబునుం
బూనగ ధర్మ, మిట్టియెడఁ బూజ్యుఁడ వన్నిటఁ గాన నీకు నెం
తేని తగున్ మహాత్మ! యిది యెంతయు మాకు ననుగ్రహంబెయౌ. 56

మా పుత్రిఁజెట్టపట్టిన
యా పుణ్యుఁడు పుత్త్రవంతుఁడై యాపిదపన్
శ్రీపుండరీక నయనుని
బ్రాపింపఁగ సన్న్యసింప భావ్యము కాదే? 57

తొలియొకనాఁడు మేడపయిఁ దొయ్యలి నెయ్యము తోడుతన్ లతాం
గులఁ గవగూడి లీలమెయిఁ గుందనపుందనుకాంతి యొప్ప, నిం
పులు గులుకన్ ముఖాంబుజము, పొల్పుగు కందుకకేళి నుండ నా
వల నెటనుండియో పడియె వచ్చి యొకండు క్షమింపఁగోరుచున్. 58

చెలికత్తియ యొక్కతె య
మ్మలశీఘ్రముతోడ విషయముం జెప్పఁగ మే

మల శరవేగంబుననే
చలియించిన చిత్తవృత్తిఁ జని కనుఁగొనఁగన్. 59

అతఁడు గంధర్వజాతికి నధిపుఁడైన
వ్యక్తి విశ్వావసుం డనువాఁడు మమ్ముఁ
గాంచి కరములు జోడించి వంచి శిరము
పలికె నిట్లని వినయసంపద చెలంగ. 60

"ఏమని చెప్పుకొందును మహీశ్వర! యో మనుసార్వభౌమ! నే
నీ ముదితన్ విమానమున నేఁగుచుఁ గంటిని; గన్నయంతనే
నా మది మోహమగ్నమయినన్ వివశంబయిపోయె వెంటనే
యీ మహిఁగూలిపోయితిని హీనుఁడనై క్షమియింపఁ గోరుచున్.

ఎంతపతివ్రతాతిలక మీ నవమోహనమోహనాంగియో
యంతయుఁదోఁచె నిట్లయినయంతనె, బుద్ధియు వచ్చె నాకు ని
క్కాంతపదాంబుజద్వయముఁ గాంచి తరించితి దోషవార్ధి, ని
శ్చింత యథేచ్ఛ మేఁగెదను, శిష్యుని నన్ను ననుగ్రహింపవే." 62

అని పలికిన విని మేమును
మనమున నచ్చెరువు దోఁప మహితాదరసం
జనితానందుని నాతని
గనికరమునఁ బంపఁ జనియె గంధర్వుండున్. 63

కావున మౌనిచంద్రమ! ప్రకాశిలు నీమె త్వదీయపత్నిగా
భావనసేయు నిన్నె భగవంతునిగా సతతంబు; నిట్టి క
న్యావరభిక్షఁగైకొనుము; నన్ను నొనర్పుము ధన్యకాంక్షిగాఁ
బావన మస్మదీయ మనువంశము యుష్మదనుగ్రహంబునన్.64

కర్దమమునీంద్రుఁ డెంతయుఁ గౌతుకమున
దెలుపఁగ నిజానుమతము, నుత్కృష్టఫణితి
మనుకులాచారవిహితధర్మప్రకార
మునను మునికిచ్చె దేవహూతిని జనకుఁడు. 65

మునికులసంప్రదాయమున మోదముతో మునిచంద్రుఁడుత్తమం
బును బహుళోపయోగమును బూజ్యమునై నిజకర్మనిష్ఠ క
త్యనుగుణ మైన యాశ్రమమునం దిటు చొచ్చెను, ధర్మదీక్ష కెం
దును బరివర్జనీయమును దూష్యము నున్నదె యాశ్రమంబులన్!

తనకీర్తి యాచంద్రతారకంబుగ నిల్వ
స్వాయంభువుండు విజ్ఞానిరత్న
మైన కర్దమమౌని నల్లుని గాఁగను
గ్రహియించి మిన్నందె గౌరవమున
అతఁడును శతరూప యతికష్టమున సుత
నెట్టులో మునిచేతఁ బెట్టి సహజ
విరహవేదన గెంటి వేయివిధంబులఁ
బుత్త్రిక నూరార్చి పోయి రంత
నాత్మదేశంబునకు, నెంతయైనఁ గాని
యొకరికొఱకయి విడుతురే సకలసుఖము

లాత్మగేహంబు భోగంబు లవనియందు
నిలుచుతాత్కాలిక ప్రేమవలన జనులు? 67

బిందుసరోవరతీరము
నం దాశ్రమ మొండు నిలిపి యత్యంతసుఖా
నందనిధానము గాఁగను
నందుండెను గర్దమర్షి యతివయుఁ దానున్. 68

ఉండి కులక్రమానుగత మున్నతసౌఖ్యనిధాన మైన యు
చ్చండతపోధనంబును బ్రశస్త విరాగసుయోగసంపదన్
మెండుగ సంగ్రహించును నిమీలితనేత్రుఁడు దివ్యచక్షు వా
ఖండలతుల్యవైభవము గల్గఁగ నాతి సపర్య సల్పఁగన్. 69

లక్ష్మి విష్ణునిఁ బార్వతీలలన శివునిఁ
బలుకుననఁబోఁడి బ్రహ్మను భక్తితోడఁ
జెలఁగి సేవించువిధము హర్షించి మించి
వారిఁ దలదన్నఁదలపందు వారిజాక్షి. 70

సతిముక్తిఁ గాంచఁ గనుటకు
వ్రతములు నుపవాసవితతి వలయునె? తలఁపన్
బతియే సమస్త మను సు
వ్రతనిష్ఠయె చాలుఁ బరమభాగ్యము లందన్. 71

తరుణీరత్నము భక్తియుక్తి ఘనతాత్పర్యంబునన్ స్నేహ త
త్పరతన్ నాథుసపర్య చేయుచును గ్రోధద్వేషలోభాది దు

ష్పురివారంబును గెల్చి యుత్తమమహాసాధ్వీత్వముంగాంచి య
చ్చెరువుం గొల్పును జూచువారికి శుచి శ్రీ నూత్నతేజంబులన్.

మునిమూర్ధన్యుఁడమానుషప్రతిభచే మోక్షాకరంబైన చిత్
ఘనయోగంబున విష్ణుసత్కృప మహాగంభీరుఁడై దివ్య శ
క్తి నివిష్ఠుం డయి దివ్యదృష్టియుతుఁడై తేజోమహారాశియై
యనిపించుం బరమేశుఁడీతఁడె యనన్ వ్యక్తాత్మనిష్ఠాదులన్. 73

ఒకనాఁడాతఁడు వత్సలత్వమున నెంతోప్రేమ తొల్కాడ నం
తికమం దున్నసతీవతంసమును బ్రీతిన్ లాలనం జేసి "యో
శుకవాణీమణి! నా కసూయ యగు నిన్ జూడంగ నీవంటి నా
తుక,సాధ్వీమణి, నుత్తమవ్రతను నెందున్ జూడ నేకాలమున్.

నాకృపఁ జూఱగొన్న లలనామణి వౌట సమస్తభోగముల్
నీ కిట లభ్యమౌను దరుణీ! తమిదీఱఁగఁ గోరుకొమ్ము తృ
ష్ణాకలితుల్ కనుంగొనని సంపద లెల్లఁ గరస్థమౌను దృ
ష్ణా క్రమనిర్జితాత్ములకు సాధ్వి! జగంబున నూహచేయఁగన్. 75

వలయునవి కోరుకొమ్ము సర్వంబు నేను
నీ కొసంగుదుఁ దన్వంగి! నిరుపమాన
నిత్యశుశ్రూషచేత ననిత్యదేహ
నిర్మమత్వముచేతఁ దన్పితివి నన్ను." 76

అని పలుకన్ గటాక్షకలితాననపద్మము లజ్జ పెంపునన్
వినమితమున్ మనోహరము నిస్తులకాంతియుతంబు గాఁగ న

ప్వనరుహగంధి స్నేహసహవాసము లందిన సౌహృదంబునన్
వినయము పెంపునన్ బలికె విహ్వలతాభయభక్తియుక్తులన్.

"ప్రాణేశ! నీ మృదుపదకంజములె చాలు
క్షణికంబులైన భోగంబు లేల?
యోగీశ! నీ కృపాయోగంబె చాలును
క్షణికంబు లైన భోగంబు లేల?
మౌనీంద్ర! త్వద్భక్తిమహితచిత్తమె చాలు
క్షణికంబు లైన భోగంబు లేల?
జ్ఞానిచంద్రమ! భవత్సాహచర్యమె చాలు
క్షణికంబు లైన భోగంబు లేల?
ఇన్నియును నీ పెఱింగియు నిట్లు నన్నుఁ
గోరుకొమ్మన నిరసింప ఘోరదోష
మగును నే నెట్లు పలుకంగ నౌను? దేవ!
సర్వవిషయజ్ఞ! తెలియు నీ శక్తి నాకు. 78

నియమవృత్తిని నిన్ను నిరతంబుఁగొల్చినన్
దనుకార్శ్య మది రవంతయును లేదు
నిద్రావిహీననై నిత్యంబు గొల్చినన్
మాంద్యంబె కలుగ దేమాత్రమైన
నిరుపమ త్వత్సేవ నిరశననై యున్నఁ
గలుగ దేమాత్ర మాఁకలియు దప్పి
నిత్యోత్సవశ్రీల నెగడు నీకడ నున్నఁ
గల్గ వాధి వ్యాధి కల్మషములు

వర్షశతములు కడచినన్ బరమపుణ్యా!
త్వన్మహాసేవ నున్న యుత్తమతవలన
తరుణతాశ్రీయె సడలదు పరమహేయ
కామవాంఛాదికంబులు కడలు కొనవు. 79

ఇది మహాభాగ్య మిట్టులే యింక నుండి
భవ్యభవదీయసఖ్యసంపదను మెఁలఁగ
గోరుకొందును కాని, దేవా! రహస్య
మొండు కల దది తలపోయ మెండుభయము. 80

నవమోహనుండ వగు నీ
ప్రవిమల తనుసౌఖ్య మంద భావము పోవన్
మిపులన్ భయమగు దానన్
ధవ! సంతతి కలుగు నన్నుఁద్యజియింతు వనన్. 81

'సంతతి కలిగెడుదాఁకను
గాంతను గవగూడి యుందుఁ; గాముకవృత్తిన్
సుంతైనఁ గనక పిదప ధ
రింతును సన్న్యాస' మను టెఱింగితి మున్నే. 82

కావునఁ బ్రాణనాథ! ననుఁ గావఁగఁజూచెదవేని యాత్మ సం
భావనయుండెనేని నను బాయకయుండుము వంశవర్ధనా
భావము లేక పుత్త్రికలు పల్వురు నాకు జనించి పెద్దవా
రై వరులన్ గడించిమనునంతకుఁ; దీర్పుము నాదుకోరికల్. 83

పద్మపత్త్రాయతాక్షునిఁ బడసి సుతుని
గాఁగ నాతఁడు నాకు మోక్షం బొసంగు
దాఁక నన్నేలుకొనుము వాత్సల్యదృష్టి
సన్న్యసింపుము తగ యథేచ్ఛంబు పిదప. 84

ఇది యుచితం బని ధవ! నీ
మదిఁ దోఁచెన యేని నీవు మన్నింపుము నన్
"సుదతిని బలికినపలుకులఁ
గొదవయొ కలదేని క్షమయొ కోరుదు" ననఁగన్. 85

"ప్రియురాల! నీతలం ప
ప్రియముల కాకరము కాదు ప్రేమంబున నా
క్రియ లెల్ల నే నొనర్తును
భయ ముడుగుము నీవు నిజము పడఁతీ! యింకన్." 86

అని మౌనీంద్రుఁడు తత్క్షణంబె నిజయోగానూనస త్త్వంబునన్
ఘనదివ్యన్మణి నిర్మితంబు సుభగాకారాత్మకోద్యాన శో
భనమందారము సౌధకేళిభవన ప్రౌఢంబు దివ్యంబు స
ద్వనితాసంయుత మౌ విమానమును జూపన్ బత్ని తబ్బిబ్బుగాన్.

కని "తరుణీ! బిందుసరో
ఘనజలములఁగ్రుంకులిడుము కల్గును నీకున్
వనజాక్షి! సకలఫలములు
ననుపమయోగం" బటంచు నానతి యీయన్. 88

"దేవహూతి ప్రవేశింపc దీర్ఘమందు
నచ్చెరువు గాcగ దోcచిరి మచ్చెకంటు
లతులసూక్ష్మాంశుధారిణులై కిశోర
నవవయశ్శోభిత లగుకన్యకలు ప్రీతి. 89

"పరిచారికలము నీ కో
తరుణీమణి! సేవగొనుము తాత్పర్యమునన్
జరియింతుము కనుసన్నల
నరయుము కారుణ్యదృష్టి" నని పన్నీటన్. 90

ఘనజలకంబు లార్చి సతిcగస్తురిచుక్కను దీర్చి, మేని క
త్యనుపమ ధూప మిచ్చి, బహుళాభరణంబు లొసంగి, లోక పా
వనములు వల్వ లిచ్చి, యతివన్ గయి సేసిరి వా రొకింతలోc
బనుపడి యామెయున్ బరమపావని సుందరియై యెసంగcగన్.

నానారసపానంబుల
నానారుచిరాన్నభోజనంబులcదృప్తిన్
నానావిధముల నొసcగియు
నానందాబుధిని దేల్చి రతివలు నామెన్. 92

అంతc గర్పూరహారతు లామె కొసcగి
యుత్తమోత్తమశయ్యపై నునిచి పిదప
నగణితసువాసనోపేత యామెదరికిc
గర్దమ మునీంద్రుcజేర్చి రుత్కర్ష మొదవ. 93

అతఁడును సహస్రవనితా
యుతుఁడయి బహునవ్యశోభనోపేతుండై
ప్రతి లేనిమన్మథుం డయి
యతిశయదివ్య స్వరూపమం దొప్పుటయున్. 94

సకలమును దోఁచె దేవహూతికి విచిత్ర
గతిగ నాపైని భర్త యోగప్రభూత
సృష్టిగా నామె చేడ్పడి చేర నతఁడు
నామెతోడ విమానంబు నంత నెక్కి. 95

అతనితో నామె నామెతో నఖిలకన్య
కా సహస్ర మధిష్ఠింప ఘనవిమాన
మాకస మ్మునఁ దారక లనఁగ వారు
కర్దముఁడు పూర్ణశశి నాఁగఁగానఁ బడిరి. 96

అనంతర మాతనికోరిక ననుసరించి 97

సకలదిగీశముఖ్యులకు సంతతదివ్యవిహారభూమియై
శుకముల కాలవాలమును సుందరదృశ్యవిరాజితంబు త
న్నికటసుధాతు నిర్ఝరగతిన్ సమశీతలమై సదా శుభ
ప్రకరము లిచ్చు మేరుగిరిపై నిలిచెన్ ద్రుటిలో విమానమున్. 98

"అదియే పుష్పక మాతఁడే ధనదుఁడాయబ్జాక్షులే దేవతా
మదిరాక్షీమణు" లంచు నెంచి జనముల్ మార్మాటలోనే "యిసీ!

యది కాదిట్టి మహాద్యుతుల్ కలవె యక్షాధీశునెమ్మేనికిన్?
త్రిదశస్త్రీ లెటులీడు వీరి''? కని సందేహింత్రు వెన్వెంటనే. 99

శరవేగంబున నందు జైత్రరథమున్ సొంతంబుగాఁజూచి యు
ద్బురపా టొందఁగ నందు నిందుఁగల యంభోరాసులన్ దివ్యసుం
దరముల్ కేళివనంబులన్ గని మహానందంబునన్ సర్వలో
క రహఃకేళులఁదేలుఁదేలు ఋషిపొంగారంగ శృంగారముల్.ఁ

పుండరీకాక్షుఁబోడగన్నపురుషవరుఁడు
కర్దమమునీంద్రుఁ డతని కుత్కర్ష కలుగ
త్రిభువనంబులఁ గలదె ప్రాప్తింపనట్టి
యేపదార్థంబుకాని సమీక్షచేయ. 101

తనప్రతిభావి శేషమున ధారుణిఁగల్గిన కేళి భూములన్
గని కని యందు నిందుఁదనకాంతను గేళులఁ దేల్చి తేల్చి పెం
పున దివిఁగల్గుకేళివనముల్ గని లీలలఁదేలియాడి యు
మ్ముని వరుఁడేఁగుదెంచె నిజభూమికిఁ దృప్తసతీద్వితీయుడై. 102

శతవర్షంబులు వారు సౌఖ్యరసవర్షశ్రాంతులై యిష్టభో
గతతిన్ దేలిరి; దేవహూతి పతియోగప్రాభవం బెంచి సం
తతిఁ గాంక్షించెను; గర్దముం డతివసత్కాంక్షన్ నివారింపకే
సతిగర్భమ్మున నిల్పె వీర్యము నవాంశల్ ప్రాభవం బందఁగన్.

అది మొదలుగ దినదినమును
మదిరాక్షికిఁ బెరుఁగఁజొచ్చె మహితం బగు సం

పద నాఁగ నాత్మగర్భము
త్రిదశులు మందారవృష్టి దివిఁగురియింపన్. 104

ఈ విధముగఁగర్దముని
సేవాఫల మనఁగఁదగిన స్త్రీసంతతి రా
జీవాక్షి దాల్చి కనె రా
జీవాక్షులఁ గాలవశముచేఁదొమ్మండ్రన్. 105

తొమ్మండ్రు సుందరాంగులు
తొమ్మండ్రును బూర్ణచంద్రతులితాస్యలు నా
తొమ్మండ్రును బద్మాక్షులు
తొమ్మండ్రును లక్ష్మితోడఁ దులతూఁగంగన్. 106

హర్షమునఁ దేలి కర్దముఁ డాత్మపుత్త్రి
కలకు బేళ్లుంచె [1]అనసూయ [2]కళ యనంగ
[3]శ్రద్ధనా [4]హవిర్భువు నాఁగ [5]శాంతి యనఁగ
[6]ఖ్యాతి [7]క్రియ [8]యరుంధతి నాఁగ [9]గతి యనంగ. 107

అమలశోభాయమానపద్మాకరమునఁ
దళతళల నీను శ్రేష్ఠపద్మం బనంగ
మణులలోపల నాయకమణి విధాన
నిందువదన యరుంధతి యెసకమెసఁగు. 108

జననీజనకులముద్దుల
కును వారు నిధాన మగుచుఁ గొమరుందనమున్

వినయాన్వితసౌశీల్యము
గని పెరుఁగం దొడఁగె రతులగతిసంగతులన్. 109

నవనవకాంతుల నీనుచుఁ
బ్రవిమలసరసీరుహప్రభాశోభితలై
పువువిలుతునిఁనిశితాస్త్ర
ప్రవరంబులు నాఁగ వారు పరగుచు నుండన్. 110

బాల్యయౌవనమధ్య మౌ వయసు వచ్చె
లలన లెల్లరు మిక్కిలి వెలయుచుండి
ఋషిసపర్యలు చేయ నూహింతు రహహ!
గతము తెల్పు ననాగతక్రమము నిజము. 111

పొరపొచ్చెంబులు లేక నెచ్చెలులుగాఁబొల్పొంది వారల్ పర
స్పరవాత్సల్యవిశేషరాగములతోఁబ్రాణంబు ప్రాణంబులై
పరమాంతఃకరణప్రవృత్తులను దివ్య ప్రేమముం జూపుచున్
బెరుఁగం జూచెద రెల్లరున్ బరమసంప్రీతిన్ గడున్ వారలన్.112

సానదీటిన నవరత్నజాలము లని
పుటము వెట్టినబంగరుబొమ్మ లనియు
దివ్యకాంతు లీను మెఱుపుఁదీఁగ లనియుఁ
దోఁచినటు వారిఁజెప్పుకొందురు జనములు. 113

మునిశుశ్రూషలు మౌనికాంతల వ్రతంబుల్ నిత్యకృత్యంబులై
జనముల్ మెచ్చెడిసత్ప్రవర్తన సదాచారంబులే క్రీడలై

వినుతప్రక్రియ నాత్మవిద్యఁగని తద్వ్యాఖ్యాతనిష్ఠాక్రమం
బొనరం జేసెడిదీక్షలే పనులుగా నొప్పారి రాకన్నియల్. 114

కర్దమప్రజాపతిదివ్యకాంక్షవలన
దేవహూతికిఁబుట్టిన దివ్యవనిత
లహహ! వారికిఁ గొఱఁతయే యమలగుణము
లవనిఁ దలిదండ్రులే బిడ్డ లౌట నిజము. 115

ఇది యగు నరుంధతీవసిష్ఠేష్టకావ్య
రాజమునఁ బ్రథమాశ్వాసరాజ మీశ!
గురువరా! త్వత్కృపామృతభరిత మామ
కీన వాఙ్మయ మిదియు నంకితము నీకు. 116

----

# అరుంధతీవసిష్ఠము
## ద్వితీయాశ్వాసము

శ్రీమద్గురువర! సత్కరు
ణామందసుఖప్రదాత! అద్వైతపథ
శ్రీమహితచిత్త! శ్రీస
ద్మామూల్యరసప్రవిష్ట! ఆర్యమహర్షీ! 1

తదనంతరకథాక్రమ మెట్టి దనిన. 2

నవరత్నంబులపగిదిని
నవలామిన్న లయి వా రనంతప్రభలన్
బ్రవిమలతనువల్లరులన్
మివులన్ జెలువొందుచుండి మెలఁగుచునుండన్. 3

కర్దమమౌనిచంద్రమునిఁ గాంచి ప్రియంబున దేవహూతి సౌ
హార్దముతోడఁ బల్కె నిటు "లార్యఋషీశ్వర! నీ యెడందయౌ
మార్దవ మెంతయున్ బరమమాన్యము, నౌట సుపుత్రికాత్మ స
మ్మర్దము కల్గెఁగాని పరమం బగుపుత్రధనంబు లోటెయౌ. 4

శ్రీరమణి నుమను మటి వా
ణీరమణిని బోలు పుణ్యనిధు లగుసుతలన్

ధారుణిఁ గాంచియు సతి తా
గారవమును గాంచలేదు కనక సుపుత్త్రున్. 5

పుత్త్రవతి యైనకాంతతోఁ బోలఁజాల
రతులితైశ్వర్యయుత లయ్యు నబల లెందుఁ
బుత్త్రికలు వేయిమందియుఁ బుత్త్రుఁ డొక్క
నికిఁ దలంపఁ గ లొచ్చంద్రు నీతినిధులు. 6

ఇహఖ్యంబుల రోఁ తపుట్టి నిఁక నే నిందుండఁగాఁజాల నీ
కుహనాభోగము లల్పముల్ మఱియు నీకుంగోర్కి సన్న్యాసమౌ
నిహలోకంబున జన్మ మింకెడుతెఱంగే తెల్పి యుద్బోధ రూ
ప హితుం డైన సుపుత్త్రు నిచ్చి కృప దేవా! నన్ను రక్షింపవే!"

అని విన్న వించుతరుణీ
మణి హృదయ మెఱింగి కర్దమఋషీశుఁడు "నీ
యనుపమయోగంబున శ్రీ
వనజాక్షుఁడు పుత్త్రుఁడగును వారిజనయనా! 8

నిరతంబున్ దలపోయుచుండు మతనిన్ నీగర్భమం దాతఁడే
వరజన్మంబును గాంచు నిన్ను నమఁబ్రోవంజాలు సంసార సా
గర బీభత్సమునుండి లోకములరక్షం దాల్చు నవ్వానికిన్
దరుణీ! కష్టము? నిన్ను నన్నుఁగరుణన్ రక్షించి దాఁటించుటల్"

అన్న మాటలు విని యామె యమితమోద
మంది శ్రీపుండరీకుని నాత్మఁదలఁచు

వ్రతములను బూని యుపవాసవితతి సలిపి
విష్ణుచింతను దినములు వెళ్లఁబుచ్చు. 10

కొంతకాలంబునకు భర్తృగురుకటాక్ష
కలిత యగునామె కార్దమకలితతేజ
మంద నారాయణుం డామెయందుఁజొచ్చి
గర్భగతజీవుఁడై యుండెఁ గరుణమెఱసి. 11

కాలక్రమమున నాయమ
లీలామాత్రుండు లోకలీలారతుఁడౌ
శ్రీలక్ష్మీదయితుని నొక
బాలునిగాఁగనియె నధికభాగ్యవశమునన్. 12

కపిలమౌనిని నిజజనిక్రమవినాశ
కరుని యోగప్రభూతునిఁబరమపురుషుఁ
గడుపు చల్లనియాతల్లి కాంచినంత
దివ్యచిహ్నంబు లెంతయుఁదేజరిల్లె. 13

మందారవృష్టిఁగురిసిరి
బృందారకు లెల్ల గగనవీథిని బరమా
నందినులై యప్సరసల్
సుందరముగ నాట్యమాడి చూపిరి ప్రీతిన్. 14

సరసజనాంతరంగములు సంతసమందెను; హోమవహ్నుల
బ్బురముగ వెల్గె సుప్రభలపుంజము లయ్యె; సముద్రముల్ కలం

కటి సుభగంబు లయ్యెను; ఫలావళిఁబుష్పములన్ నతంబులై
పెరగెను వృక్షరాజి; ఫలవంతము లయ్యెను సర్వసస్యముల్.

ప్రకృతికి ఁబరుల్లైఁ వెలిఁగెడు
సుకృతులు జనియించునపుడు శోభిల్లెడి యా
ప్రకృతికె యాకృతి నొసఁగిన
సుకృతియె జనియింప మిగుల శోభిలకున్నే! 16

కపిలావతారవేళా
సుపవిత్రత నెంచి బ్రహ్మ సూనులతో న
య్యపవర్గకాంక్షిఁగర్దమ
తపస్వినిన్ దేవహూతి దర్శించి వెసన్. 17

"పరమపవిత్రులార! భగవంతునిఁబుత్త్రుని గాఁగఁగన్న యో
గ రతులు మీరు మీ రెవనిఁగాంచితి రాతఁడె దేవహూతి క
చ్చెరువుగ నిచ్చు మోక్షము; విశిష్టమతం బగుసాంఖ్యయోగమే
పరమమతంబుగా నిలుపు; భక్తులఁబ్రోచును జ్ఞానదాతయై."

అని చెప్పి కపిలదేవుని
మనమున కెక్కన్ నుతించి మఱి కర్దమునిన్
మనమార సంస్తుతించి య
తనియాత్మజలన్ విరించి తగఁగని యనియెన్. 19

"సరసిజనేత్రలార! విలసద్గుణరాజితలార! మీర లా
పరమబుషీంద్రపత్ను లయి భాసిలఁగాంతురు దివ్యకీర్తులన్

బరఁగుదు రస్మదాదులకు భావన కందనిపూజనీయలై
కర మరుదైన మీకథ జగత్త్రితయంబున కొజ్జబంతి యౌ.20

నాకంటె మిన్నలై సుభ
గాకారులునై యెసంగునట్టి మహర్షుల్
చేకొంద్రు మిమ్ము సతులుగ
లోకంబులు శుభములన్ వెలుంగఁగ మీచే". 21

"అని కొనియాడి ధాత తనయాత్మజుఁడైన మరీచిమౌనిచం
ద్రునిఁగని "వత్స! నీవు కళనుం గొని పత్నిగ గార్హధర్మ జీ
వనమున సంతతిన్ నిలుపు భావ్యము నీ కిది నిన్ను నీమె దే
వునిగను గొల్చి కీర్తిరమఁబొందును లోకులు సంతసింపఁగన్".

అని విరించి మరీచికి నాజ్ఞచేసి
కర్దమునియింట విడిచి శీఘ్రమున నేగె
నారదాదుల నాత్మనందనులఁగూడి
సకలపుణ్యాస్పదం బాత్మసదనమునకు. 23

అంతటఁ గర్దమర్షియుఁబ్రియంబును గాంచి మరీచిమౌని న
త్యంతకుతూహలంబున సుఖాంబుధిఁదేల్చుచు నాదరింపఁగా
నంతటిమౌనిచంద్రముఁడు నంతటిజ్ఞానియు నంతయోగ్యుఁడా
వంతయుఁ గష్టమందకయె యబ్బెఁగదా యని పొంగిపోయెడున్.

కార్యమునయందుఁగార్యము కలిసివచ్చు
ననియు సమవయస్కులు నని యందఱికును

నొక్కసారియె యుద్వాహ మొనరఁజేయ
దలఁచి వెదకం దొడంగు నుత్తమవరులను. 25

అనసూయాగుణగౌరవంబుఁదలపోయం జొచ్చి సాదృశ్య స
ద్గుణసంపన్నుఁడు తుల్యరూపవిభవోద్భూత ప్రకాశుండు స
జ్జనమందారుఁడు దివ్యశక్తినిధి విజ్ఞానప్రభావాఢ్యుఁడౌ
మునిరత్నం బగు నత్రిమౌనిఁ దలఁచెన్ ముమ్మాఱు సంప్రీతిగన్.

అమలినకర్దమర్షి హృదయంబునఁబుట్టిన పూజ్యభావ ము
త్తమముగఁబాటి పాటి వినుతం బగుసద్ర్వతదీక్ష నున్న య
త్రిమునిని జేరి యాతనికిఁదీవ్రముగా జనియింపఁజేసె ను
త్తమతరుణీ వివాహదృఢతత్పరతన్ క్షణమాత్రలోపలన్. 27

భావన కెంతశక్తి తలఁపన్ విలసిల్లునొ యౌర! యంచు సం
భావనచేసి యత్రిముని పావనకర్దమయోగశక్తి సం
భావన కాత్మ మెచ్చి యిఁక మానునె కాక వివాహ మంచుఁగ
న్యావరకాంక్షఁగర్దమగృహంబునుజేరెను దత్క్షణంబునన్. 28

అహహా! మౌనితపఃప్రభావములు భావాతీతశక్త్యన్వితుల్
విహితాత్మక్రియ లంతరార్థములు గంభీరంబు లూహింపఁ బ్ర
త్యహమున్ దోఁతు రలోకజీవనులుగా నార్యర్షు లెన్నంగ లో
క హితశ్రేష్ఠులు వారె వారిఁ బొగడంగా నౌనె యెవ్వారికిన్! 29

కర్దముఁడు దేవహూతి యుత్కంఠమీఱ
నత్రికెదురేఁగి యర్ఘ్యపాద్యంబు లొసఁగి

యుచితసంభావభావితు నొనరఁజేసి
ప్రీతిఁగూర్చిరి తాము సంప్రీతు లయిరి. 30

శ్రద్ధ యనుకన్య కనురూపచరితుఁడైన
వరు నరయఁగోరి కర్దముఁడురువివేక
మునఁదలంచెను నంగిరోముని మిగుల
నిశ్చలం బైనయాత్మలో నిమిషమాత్ర. 31

ఘన మగునిష్ఠనాత్మ శితికంఠపరాయణమై చెలంగఁబెం
పును గను నంగిరోముని యపూర్వముగాఁ గనియెన్ హృదంతరం
బున నొకయంతరాయమును బూనిననిష్ఠకు నంత దివ్య దృ
ష్టిని బరికింపఁదోఁచిన దశేషభవిష్యకథావిశేషమున్. 32

అతిచిత్రంబులు దైవలీలలు మహాహంకారులై మానవుల్
మతిలో నెంతురు సర్వమున్ నిజకృతుల్గా నాకు నేఁడిట్టి స
ద్వ్రతభంగంబులు పెండ్లిబేరములు సంప్రాప్తించెఁగా! యంచు స
మ్మతి నేతెంచెను గర్దమర్షికడ కా మాన్యాత్ముఁడున్ వెంటనే. 33

కర్దముఁడు దేవహూతియుఁగౌతుకమున
నతని కెదురేగి యర్ఘ్యపాద్యంబు లొసఁగి
సర్వసత్కారము లొనర్చి సంతసమున
నాత్మమందిరమున నిల్పి రతులభక్తి. 34

పూర్ణసుగుణాబ్ధి యగు హవిర్భువును దలఁచి
తుల్యరూపగుణంబులు తోఁచినంత

ఘనుఁబులస్త్యుని దలపోసె గర్దముండు
క్షణము హృదిలో విమర్శించి సన్మనీష. 35

అంతఁబులస్త్యమౌనికి హృదంతరమందునఁజెప్పరాని య
త్యంతముదంబు గల్గ దరహాసము పుట్టఁగ నాత్మలోనఁని
శ్చింతఁదలంచినన్ నిరవశేషము బోధపడెన్ సమస్తమున్
వింతలు దైవలీల లని వేమఱు లెంచి పులస్త్యుఁడాత్మలో. 36

బయలుదేఱెను గర్దమప్రభునిఁజేర
నాతఁడును దేవహూతితో నర్ఘ్యపాద్య
సత్క్రియలతోడ నెదురేఁగి సంతసమున
నాదరించెను వచ్చినయంత నతని. 37

గతి యను నిజపుత్త్రిక సం
గతి కర్దముఁ డెంచఁబ్రీతి కడలుకొనంగన్
మతిఁదోచెఁ బులహమౌనియు
వ్రతులకు సదసద్వివేకవైభవ మరుదే! 38

పులహుం డాత్మతపఃపరాయణుఁడునై పొల్పొందువేళం దలం
పులు పైఁబడ్డఁ గలంగ మానసము నెమ్మో మెఱ్ఱనై క్రోధసం
కుల మయ్యెన్ దన కిట్లు విఘ్నములు చేకూరం గతంబేమి యం
చలఁతింబోక కరంబునం గొనియె శాపాక్షేపవాగ్ధారలన్. 39

ఇంతటిలోన నాంతరపుదృష్టి నిగుడ్పఁగఁగర్దమర్షి శు
ద్ధాంతరసౌహృదంబు గననయ్యెను వానికి బోధ యయ్యె వృ

త్తాంతము సర్వమున్, మిపుల దవ్వులఁజిమ్మెను శాపవారి య
త్యంతముదంబునన్ బయనఁమయ్యెను బెండ్లికి నీశ్వరాజ్ఞగాన్.

కర్దముఁడు దేవహూతియు ౘగడలుకొన్న
కౌతుకంబున నెదురేఁగి గౌరవమున
నర్ఘ్యపాద్యాదు లందించి యాదరించి
పులహు నిలిపిరి గృహమునఁబొలుపుమిగుల. 41

కమలాసనచోదితుఁడై
సమరూపవయోనుకూలసమరసభావ
ప్రమదాంతఃకరణుల ను
త్తమవరులను గర్దముండు ధన్యుం డేలెన్. 42

క్రియ యను తనకూర్చెడు క
న్నియకును గర్దముఁడు కూర్చు నిరుపమనిష్ఠా
నియమవ్రతుఁడగుక్రతువును
వయసును రూపంబు గుణము వఱలఁగ సమమై. 43

ఖ్యాతి యనం జెలంగుతనకన్నియ కంతటఁ గర్దముండు వి
ఖ్యాత తపఃప్రభావుఁడు సమంచితవిజ్ఞుఁడు రూపమన్మథ
ఖ్యాతుఁడు ప్రీతచిత్తుఁడగునార్యు భృగున్ బతి కాఁగ నెంచినన్
బ్రీతి నతండు వచ్చె నురరీకృతిఁగర్దముఁడాత్మ మెచ్చఁగన్. 44

శాంతంబు రూపుఁదాల్చుట
శాంతి యనం జెలఁగు నాత్మజను గర్దముఁడ

త్యంతముఁగూర్చెడునామెను
స్వాంతమునం దెంచి చూచె సరిపడుభర్తన్. 45

తలఁచి చూడఁగఁ దోఁచె నభర్వుఁడనెడు
నుత్తమతపోధనుండు గుణోత్తముండు
కర్దముఁడు వానిఁగాంక్షించె గాఢముగను
నాతఁడును బ్రీతి నిచ్చెసె నందుకొఱకు. 46

కన్నియ రూపుఁగోరు నధికంబుగఁగోరును దండ్రియున్ మహో
భ్యున్నత సద్గుణౌఘమును నున్నతసంపదఁగోరుఁ దల్లి యి
ట్లన్నియు నాత్మ నెంచి తనయల్లురఁగూర్చెను గర్దమర్షి యి
న్నిన్నియు నొక్కచోఁగల ఋషీంద్రుల నాత్మమహత్త్వ మెట్టిదో! 47

సుదతీరత్నములందు శ్రేష్ఠయయి తేజోరాశియై కామ్యముల్
మది వర్జించి తపఃప్రభావమున సమ్మాన్యాత్మయై యొప్పుచున్
ముదమొప్పన్ విహరించుచున్ పెలయు సంపూర్ణేందుబింబాస్య సం
పదలన్ బొల్చు నరుంధతీరమణి కే భవ్యుండు ప్రాప్తించునో? 48

అని కర్దముఁడత్యంతము
మనమునఁదలపోసెఁదుల్యమహిమాన్వితు నె
వ్వనిఁబ్రార్థింతునొ యని నె
మ్మనమునఁబొడకట్టఁడయ్యె మహితుఁడెవండున్. 49

కలఁడు కలఁడు వసిష్ఠర్షి కలఁడటంచు
నెంచుచుండును గాని యేరీ? తదీయ

దివ్య తేజంబు సైరింపఁదివురువార
లనుచు భయమందుఁదలపోయ నతని నితఁడు. 50

భువనములందుఁబొల్పెసఁగు పుణ్యుల నెల్లర నుత్తమర్షులన్
మివులఁ బ్రసిద్ధులై చను మనీషుల నెంచి వసిష్ఠమౌనియే
తవును బరిగ్రహింప గడుధన్య నరుంధతి నంచు నెంచి యా
ప్రవిమల మానసాంబురుహుఁబ్రార్థనచేసెను గర్దమర్షి తాన్. 51

కర్దమమౌనిప్రార్థనముఁ గాంచి వసిష్ఠుఁడు దివ్యదృష్టి సౌ
హార్దముతోడఁ గర్దమగృహాంగణభూమికి నేగుఁదెంచినన్
గర్దమదేవహూతు లతిగౌరవ మొప్ప సమాదరించియున్
మార్దవ మొప్పఁ బల్కియును మాన్యతఁ గొల్చి రనేకభంగులన్. 52

కరుణాళువై వసిష్ఠుఁడు
పరమవినీతిని గ్రహించి పరిచర్యల నా
దరమేదురతను కనుఁగొనె
నరుంధతిని సుగుణభూషణాంచితరూపన్. 53

కాంచినయంత నామె తనకాంత యటంచు గ్రహించి యాత్మలో
నెంచెఁబరీక్షచేయ ధర నెంతటిస్వర్ణమహత్త్వమైన నొ
క్కించుక గీటుజాయిపయి నిట్టటు గీచినఁగాది వ్యక్తమౌ
నంచు వసిష్ఠమౌని, ఇది యోఁగద! యుత్తమభంగి యెన్నఁగన్. 54

"ఓయి కర్దమ! నీయింట నున్నవారె
యిసుక వంట యొనర్చెడి యిగురుఁబోండ్లు?

అట్టులైన మనోభీష్టమగును మనకుఁ
దెలుపు'' మన నూఱకుండిరి లలన లెల్ల. 55

తండులంబులు తెచ్చినఁదగినరీతి
వండిపెట్టంగ వనితలు వలఁతు లగుదు
రంతియే కాని యిసుక నేయింతి వండఁ
గలదు నిజముగ నుత్తమకాంత గాక. 56

ఇతనికోరిక తీరనియెడల నెట్లు
సంభవించును నా కోర్కి సఫలత యని
కర్దముడుఁతెల్పె నీమాట కంబుకంఠి
యగు నరుంధతి కామె యిట్లనియెఁబ్రీతి. 57

''ఇది యెంతటిపని? తండ్రీ!
మది సంశయ ముడిగి చెప్పుమా? యా ఋషికిన్
ముదఁమొదవ వండి పెట్టుదు
నిది క్షణమున నిసుకఁదెచ్చియిమ్మా! నాకున్''. 58

ఈ మాటల్ విని కర్దముండు మదిలో నెంతో ముదం బంది యీ
భామారత్నము చేయఁజాలు నని చెప్పంబోయె నమ్మౌనితో
ఏమో? యెంతటి శక్తి యున్నదియొ? మేలేకాద యట్లైనచో
నీ ముష్టింపచుఁడిట్లనన్ గతము లున్నే? యంచు లోకుల్ వెసన్.

ఎవరికిఁ దోఁచిన ట్లచట నెల్లరుఁ బల్కికొనన్ వసిష్ఠుఁడ
య్యువిద కొసంగెనాయిసుక నొప్పుగఁగొల్చి సమంచితంబుగాఁ

దవినతెలుంగునన్ నలువిధంబుల భక్ష్యము లేహ్య చోష్యముల్
మివు లగు పానమున్ జలుప లేమయుఁ గైకొని భక్తి పెంపునన్.

ఇది యపూర్వము దీనినె ట్లీపడంతి
చేయఁజాలునొ చూత మచ్చెరు వటంచు
సిద్ధసాధ్యులు దేవతల్ శ్రేణిగట్టి
యంబరంబున నిల్చిరి సంబరమున. 61

ఈచెవి నాచెవిం బడి యనేకజనంబులు మౌని శేఖరుల్
చూచి తరింత మంచుఁగడు జోద్య మటంచును జేరవచ్చి సం
కోచము లేక యమ్మునిని నకుంఠితతేజుని జ్ఞానమూర్తి భా
షాచతురాననున్ గని ప్రశంస యొనర్చిరి భక్తియుక్తులై. 62

తరుణీరత్న మరుంధతీవనిత చేతఃప్రీతిగా మౌని శే
ఖరుఁడైనట్టి వసిష్ఠుఁడిచ్చు నిసుకన్ గైకొంచుఁబాత్రంబులన్
సరిగా నాల్గిటఁబోసి భక్ష్యమును జోష్యం బంతటన్ లేహ్యముల్
వరపానీయములన్ బొనర్చె క్షణకాలంబందు నేర్పొప్పఁగన్. 63

ఆయమ చేతిచల్వ యది యట్టిదయేమొ క్షణంబులోన నా
ప్యాయపుభక్ష్యచోష్యములు నయ్యెను లేహ్యము లయ్యె నంతఁబా
నీయము లయ్యె నయ్యిసుక నిశ్చయ మిట్టి పవిత్రహస్తముల్
చేయఁగ లేని దెద్దియని చిత్తరువుల్ వలె నైరి చూపఱుల్.

ధణధణ దేవదుందుభులు తద్దయు మ్రోసె, సురాళిఘంటికల్
గణగణ మ్రోఁగె,ఁదూర్యయుగళంబుల నాదము లొప్పె, నప్సరో

గణముల యాటపాటలును గమ్మనిన్నృత్యములున్ జెలంగె, నా
క్షణమునఁబుష్పవర్షమును గాఢముగాఁగురిసెన్ బొరింబొరిన్. 65

దిశ లెల్లన్ శమితంబులయ్యెఁదమయుత్సేకంబులన్ వీడి స
ద్యశమున్ గాంచఁగఁశాంతమున్ గనియె సంద్రంబుల్, సుహృత్పాలికిన్
వశమయ్యెన్ సకలేంద్రియంబులును సంప్రాప్తించె లోకాళికిన్
బ్రశమానూనసుఖం బరుంధతి యొనర్పన్ వంట చిత్రంబుగన్. 66

జయనాదంబుల దేవకామినులు పుష్ప వ్రాతముం జల్లగా
భయభక్తిప్రతిపత్తులన్ బుషిసమీపప్రాంతముం జేరి "ఓ
ప్రియమౌనీశ్వర! సిద్ధమయ్యెను మనోభీష్టంబు తీరంగ వం
ట యిదే ర" మ్మని చేరఁజీరెను వసిష్ఠబ్రహ్మ నక్కాంత తాన్. 67

"సంతోషించితి నేల భోజనము! నీసాంగత్యమే కోటివేల్
కాంతా! నే నిదె వత్తు నిప్పుడె లసద్గంగాజలాపూర్ణ మ
త్యంతప్రీతిదమీకమండలువుఁ జేతం బూని నారాకప
ర్యంతం బిద్ది గ్రహించి యుండు" మని తా నందించె నమ్మౌనియున్.68

అందించిన నా కాంతయు
నందించి మహాప్రసాదనయసంగతిఁదా
నందికొనె నాకమండలు
వందక సందేహ మించుకైనను భక్తిన్. 69

జలపూర్ణంబగునాకమండలువు హస్తం బందునం బట్టి యా
లలనారత్నము నిల్చె నమ్మునియు సంలక్షించి యక్కన్నె న

మ్ములవేగంబునఁ నేగె నెచ్చటికొ యేమో యెందుకై యేఁగెనో
తెలియన్‌రా దటఁ బ్రొద్దు గ్రుంకినను నే తేఁడయ్యె నేపాటికిన్. 70

దినములు కడచనెఁ బక్ష
మ్మును నిండెను నెలలుకూడఁ బోయెను గానీ
ముని బ్రుచ్చు రాకపోయెను
వనితామణి యేకదీక్ష వదలక నిలిచెన్. 71

తిండియుఁ దిప్పలున్ గనక దీర్ఘదినంబులు వాసరంబు ల
ట్లుండి చలింపఁ దయ్యె "నిటు లొప్పదు దాని నటుండ నిచ్చి యో
యండజయాన! తిండి తిని యాపయిఁ జేయుము నిత్యకృత్యముల్
దండితనంబు వీడి" యనఁ దా బదు లాడదు కంటఁ జూడదున్. 72

రాఁడయ్యెన్ మునిరాజు జాడ కనఁగా రాదయ్యెఁ దన్వంగి యి
ట్లేఁడుల్ పూఁడులు నేఁగుదెంచినను గానీ దీక్ష యేమాత్రమున్
వీడంజాలక యుగ్రనిష్ఠ నిలువన్ వెన్వెంటనే లోకముల్
పేడెత్తెన్ నిజధర్మముల్ తొలఁగఁగాఁ బెంపేది రార్యర్షులున్. 73

కలగెం దోయధు లెల్లఁ జక్కనినదుల్ గాంభీర్యముల్ వీడి కా
కలఁ దేలం దొడఁగెన్ జగం బులిసె శోకం బందె భూదేవియున్
వెలవెల్పోయె దివాకరుండు ఋషిసద్బృందంబు లెల్లన్ మన
శ్చలనం బందెను తాలు మాలుగ సమస్తం బింక వేయేటికిన్.

కర్దమమౌనిచంద్రుఁ డధికంబగు ప్రేముడిఁ జేరవచ్చి "నీ
దుర్దమ నిష్ఠచే జగ మధోగతి పొందఁగ నున్న దమ్మ! యీ

దుర్దశ మాన్పఁగా బరమదుస్స్పహ మీఁతప మింత మాను నిన్
గర్దమమౌనిపుత్త్రి వని గాసిలి తిట్టుదు రట్లు కానిచో". 75

అని యెంతెంతని వేడుకొన్నఁ జెవియం దావంతయున్ జేర్ప దే
మని మాటాడదు లోక మెట్లయిన నేమౌ నాకు నానిష్ఠనా
కును జాలున్ బలుమాట లేల యిఁక నొక్కో నాఁగ నా దివ్యదీ
క్షను మౌనంబె సమస్తమున్ దెలుపునాఁగా నుండె నక్కాంతయున్.

తండ్రి ప్రార్థించి విఫలుఁడై తలఁచె లోన
నిట్టి దుర్దమవ్రత నిజం బెంచి చూడ
నాకు గౌరవహేతువే నాక కాదు
సకలలోకసంరక్షిణి సత్య మంచు. 77

తండ్రి ప్రార్థించి విఫలుఁడై తప్పుకొనిన
దల్లి ప్రార్థించె మిక్కిలి దా నరుంధ
తీరమణి పక్షపాతంబు తేటపఱుప
దయ్యెఁదలిదండ్రులందు వ్యత్యయముఁజూపి. 78

ఋషివతంసులు నొకఁరొక్కరే క్రమమునఁ
"దల్లి ! యుడుగుము నీ దీక్ష దయదలిర్ప
లోకముల నేలు" మన్న నాళీకనయన
యతనితోడిద లోక మం చాత్మ ఁదలఁచు. 79

తలఁపన్ గొందఱు దీక్షయే యెఱుఁగ రేధర్మంబునుం జూడ రా
ర్తులు వారల్ కడు హీను లెన్నఁగను మందుల్, కొంద ఱీదీక్షయం

దలరన్ శ్రద్ధను జూపి బాధ యగుచో నావంకకే చూడ ర
త్యలఘుల్, సువ్రత ముత్తములే విడువ రే యాతంక మేతెంచినన్.

ఈ గతి నా యరుంధతి యహీనమహావ్రత దీక్షచేత స
ద్యోగ మహాగ్ని వెల్వడి మహోన్నతభంగి సమస్తలోకముల్
క్రాగఁగఁజేయుచుండ సురకామినులు త్తలమంద నింద్రుఁడా
వేగముతోడ నేఁగి కడు వేఁడె విరించిని రక్షసేయఁగన్ఁ. 81

చతురామ్నాయము లొక్క పెట్టునను ఘోషల్ పెట్టఁబద్మాసనుం
డతులప్రౌఢిమఁ గోలుపోయినటు లాహా!యంచుఁ జింతించుచున్
మతి దిట్టంబొనరించుకొంచు నిజహంసారూఢుఁడై కర్దమ
ప్రతికూఁతున్ఁవెదకందొడంగె మది సంభావించి యేతత్కృతిన్.

నలువ విచ్చేసి యా యరుంధతిని గాంచి
"బిడ్డ! యుడుగుము. నీ మనోభీష్టమేమి?
జగము లల్లాడిపోయె నీసరణి తగునె?
మాను వ్రత" మని మటీ బతిమాలుకొనియె. 83

నలువయంతటివాని నైనను గనంగ
నిష్టపడదాయె మాటాడ నెంచదాయె
నాఁయరుంధతి నిలుచుండి నట్లె నిలిచి
పట్టిన కమండలువు నట్లె పట్టియుండె. 84

ఈమెఁ గదల్పనింక వెఱ వేమియు లే దని బ్రహ్మ యాదిగా
నా మహితర్షి చంద్రులును నద్భుతకంఠనినాద మేర్పడన్

"శ్రీమహనీయతాపస! విశిష్ట! వసిష్ఠమహర్షి! శీఘ్రమే
యీమహిమాస్పదన్ గనఁగ నిచ్చటికే పఱతేవె సత్కృపన్. 85

నీకృప లేనిచో బ్రదుకనేరము దేవ! క్షణంబుకూడ నీ
యీ కృపగల్గుచోఁ దృణమ యేనియు మేరుసమానమే యగున్
మాకయి లోకసంకటము మానుపుకోసము వేగ వచ్చి నీ
వీ కమలాయతాక్షివ్రత మింతకుఁబూర్ణసమాప్తి చేయవే! 86

లోకసంరక్షణార్థ మ్మై నీకు జన్మ
మరయ మము బోంట్ల రక్షించు టగు వ్రతంబు
కుంభసంభవ! విచ్చేసి కొమరుమిగులఁ
బెండ్లికొడుకవు కాఁగదే ప్రియ మెసంగ". 87

అని వేడుకొనుచు నుండఁగ
మునిమూర్ధన్యుఁడు వసిష్ఠమునిచంద్రుఁడు న
వ్వినువీథినుండి దిగియెను
ఘనతేజము దిక్కులందుఁ గ్రమ్ముకొనంగన్. 88

వచ్చి నమస్కరించిన తపస్వుల కెల్లఁ బ్రతిప్రణామముల్
మెచ్చి యొనర్చి పద్మభవు మేదురభక్తి నుతించి వెంటనే
యచ్చపలాక్షిఁ గర్దముని యాత్మజఁ జేరి "లతాంగి! యీఁ గదే
వచ్చితి నా కమండలువు భద్రము చేసితి విచ్చు మెచ్చితిన్. 89

అను నవ్వసిష్ఠుపలుకులు
విని కన్నులు విచ్చి చూచి వినమితశిరయై

తనచేతికమండలువును
మునిచేతం బెట్టి కదలి మ్రొక్కె నతనికిన్. 90

సుమవర్షంబులు దేవతల్ కురియ యక్షుల్ కిన్నరుల్ నృత్యమున్
సమదస్ఫూర్తి నొనర్పఁగా మఱియు గంధర్వుల్ జయధ్వానముల్
ప్రమదం బారఁగఁజేసి గీతవితతిం బాడంగ దివ్యంబు ది
వ్య మటంచున్ జనముల్ నుతింప శుభముల్ ప్రాప్తించె లోకాళికిన్.

"పడఁతి! లె మ్మింక శుభములు పడయఁగలవు
సిద్ధ మిది త్వన్మనోభీష్టసిద్ధి యగుట"
యని వసిష్ఠుఁడరుంధతిహస్తయుగళిఁ
బట్టుకొని లేవనెత్తెను బ్రణయ మొప్ప. 92

అహహా! మహర్షి పాణి
గ్రహణం బొనరించినంత గన్నియ కపుడే
స్పృహ గలిగి సిగ్గు గదిరిన
దహతహపడి లోని కరిగెఁదరుణులు నవ్వన్. 93

"తడయఁజూడకు మింకఁ గర్దమ మునీంద్ర!
శీఘ్రముననే వివాహసంసిద్ధిఁ గూర్పు"
మంచు నానతియిచ్చె నాయంచరౌతు
అ వ్వసిష్ఠుఁడు వినఁజిఱునవ్వుతోడ. 94

సుముహూర్తం బది నిశ్చయించుకొని యచ్చో సర్వసంభారముల్
సమకూర్చెన్ బుషికర్దముండు పరమాశ్చర్యంబుగన్ మున్నె; యా

త్మమహత్త్వ ప్రతిపాదకుల్ భువనసంభావ్యాత్ములైనట్టి మౌ
నిమహారాజులుఁ జేయఁజాలనివి యున్నే యెట్టికృత్యంబులున్!

పెండ్లిపెద్దలు చనుదెంచి విడిసి యుండి
రతనిగృహమందు జామాత లంద అతని
నుతితతులఁదన్పువా రైరి నతు లొనర్చి
యతఁడు గావింపఁబెండ్లిండ్ల నబ్బురంబె! 96

తనతొమ్మంద్రుకొమార్తె లిట్లు పరమాత్మజ్ఞానవిజ్ఞానులన్
ఘనమౌనీంద్రుల రూపమన్మథుల నిష్కామ్యాత్ములన్ దేవదే
వ నికాయ స్తవనీయులన్ ద్రిభువనప్రఖ్యాతులన్ బ్రహ్మ జీ
వనులన్ భర్తలుగా గడించి రని యాబ్రహ్మర్షి యుప్పొంగుచున్.

మునికులసంప్రదాయమున మున్నటు లొప్పిన శాస్త్రపద్ధతిన్
గని మనమందు గర్దముఁడు కాంచి సదాచరణంబు వీని మే
ళనమునఁజేయఁబూనెను జెలంగి వివాహమహోత్సవంబులన్
వినుతవిధాన మొప్పఁగఁబవిత్రగతిన్ సుమనోనుకూలతన్.

బ్రహ్మ మునుముందు నతనియాధ్వర్యవమున
సర్వదేవతాఋషిగణసన్నిధాన
మందు దివ్యవై భవముతో నలరెఁగర్ద
మాత్మజలపెండ్లి లోకంబు లలర ఁబ్రీతి. 99

మునివర సామగానరవముం బురుడించుచుఁగోకిలాంగనా
జన కలగానముల్, నెమలిసంతతి షడ్జము లొప్పుచుండఁగా,

ననవరతంబు నధ్యయనమందునఁబాల్గొనుకీరరాజముల్
గొనకొని కల్పగాఁదొడఁగెఁగూర్మి శ్రుతిన్ మునివేదఘోషతోన్.

నృత్తము సల్పునచ్చరలు నెమ్మికులం బొనరించునాట్య సం
పత్తిఁదదీయ నూతనవిపర్యయముల్ కనినన్ మనంబులన్
హత్తుకొనంగ మైమఱచి యాటలు మాని నిజా త్తశాస్త్ర మా
వృత్తియొనర్చుకో దొడఁగ నెల్లరు నవ్విరి సిగ్గుచేటుగన్. 101

అరవిడి నూత్నశోభల నయాచితభంగి దిశాముఖంబులన్
బరఁగఁగఁజేయుపద్మములఁ బావనభంగిఁ గరేణుయూథముల్
సరసముగా గ్రహించి సుమసంగతిచే గజమాల లెన్నొ చే
కురిచి నవీనదంపతులకున్ గయి సేయును భక్తియుక్తులన్.

మందలు మందలై తమ కమందసుఖం బిది యంచుఁ జెప్పఁగా
డెందములందు నెంచియొ కడింది పొదుంగులతోడ దివ్యగో
బృందము లా ప్రదేశమునకే పఱతెంచి పయస్సులన్ మహా
నందముతోడుతన్ గురిసి నందినులే యనఁబొల్చు నిమ్ములన్.

పండి యుండినపండు లీపెండిలికయి
నిల్చియున్నవో నాఁగ నా నిమిషమందె
రాలిపడిపోయి యాఁమునిరాజిభుక్తి
కొఱకుఁజూపును వారి కకుంఠభక్తి. 104

పిల్లతెమ్మెరలనె పంపి మెల్లమెల్ల
వారినునుమేనులకు సుఖప్రమద మీయ
వాయుదేవుఁడు చూపు హృద్భక్తియుక్తి
తన సదాగతిత్వమ్ము సార్థకము గాఁగ. 105

తనకున్ రక్షకులై జగంబుల నితాంతప్రేమ వాటించుచున్
మనువారేకద! వీర లంచుఁదనకున్ మర్యాదగా వారికిన్
దనభక్తిన్ బ్రకటింపఁగా శమితతీక్ష్ణత్వంబునన్ మందమై
యినుఁడొప్పున్ సమశీతలుం డయి గుణాకృష్టాత్ము లిట్లుండరే?

స్వచ్ఛమై శారదాభ్రంబుచంద మగుచు
నొప్పె వినువీథి నీలిమ నొప్పుమిగిలి
సరసహృదయంబులను బోలి సరసులందు
నీరములు గాంచె స్వచ్ఛతన్ నిశ్చలతను. 107

ఈగతిఁ బంచభూతములు హృష్టములై మఱి హృష్టి నిచ్చి తే
జోగరిమన్ జెలంగఁబరిశుద్ధమనస్కులు సంతసింపఁగా
నాగమవేదులై చెలఁగునార్యఋషీశులఁజెట్టవట్టి శో
భాగురుతన్ జెలంగిరి శుభప్రదకర్దమపుత్త్రికామణుల్. 108

సృష్టికర్తయు వారి నాశీర్వదించి
యాత్మధామంబునకు నేఁగె నంచమీఁద
తక్కుదేవత లాశీర్వితానములను
గురిసి వారలపైఁ జేరుకొనిరి దివిని. 109

ఆ పిమ్మట యథావిధివివాహసంస్కారానంతరము

గుమ్మ లగు కూఁతుండ్రను దొమ్మండ్రుగు
రల్లుండ్రకు నొప్పగింతలు పెట్టి కన్నులనీరు గ్రమ్ముకొన. 110

"ముద్దుబిడ్డలార! ముదముతోడుత నేగి
పతులవెంట వారె గతులు కాఁగ
మమ్ము మఱవకుండ మహిత యశస్సము
పార్జనమ్ముఁగాంచి వఱలుఁడమ్మ!" 111

అని తమకన్యలన్ బతుల కర్పణచేసి సగౌరవంబుగా
ననుపమ వస్తుసంతతు లనంతము వారల కిచ్చి నిత్యఁనూ
తనములు కట్టుఁ బుట్టములు ధన్యత వారి కొసంగి మేలి భూ
షణము లొసంగి పంపిరి ప్రశాంతమనస్కత వారి నెల్లరన్. 112

తుద కరుంధతీ దేవిని ముదము మీఱ
నఁవ్వసిష్ఠునితోఁ బంపునవసరమున
గనుల వెంబడి నశ్రువాహినులు పాఱె
దేవహూతికిఁ గర్దమ ధీమణికిని. 113

ఇది యగు నరుంధతీవసిష్ఠకావ్య
రాజమున ద్వితీయాశ్వాసరాజ మీశ!
గురువరా! త్వత్ప్ర పామృతభరిత మామ
కీన వాఙ్మయ మిదియు నంకితము నీకు. 114

***

# అరుంధతీవసిష్ఠము
## తృతీయాశ్వాసము

శ్రీగురు సాంబసదాశివ!
శ్రీగురు పరమాత్మ! జ్ఞానసిద్ధిప్రద! వి
ద్యాగురుచూడామణి! స
ద్యోగీంద్ర! మహానుభావ! యోగనిరూఢా! 1

అది వసిష్ఠమహర్షి దివ్యాశ్రమంబు
భూతలస్వర్గ మన్న నా పొలుపులేమి
స్వర్గమందు నలంకారశాస్త్రవిదులు
ఉపమ కుపమానలోపమే యొదవునంద్రు. 2

అది సుమనోహరంబగు మహావనరాజ మటన్ సమస్త సం
పదలు విరాజిలున్ సహజభంగి ననారతమున్ బ్రసూనముల్
మృదుల లతాళులన్ దమకు నెప్పుడు వాడుటయున్ సుగంధముల్
వదలుట నేలపైఁ బడెడిపాటును లేక చెలంగు స్వచ్ఛతన్. 3

మునికాంతాతిలకంబు లాత్మపతు లాముష్యాయణుల్ చేయు దే
వనికాయార్చనకున్ శుచిస్మితముఖవ్యక్తాత్మలౌచున్ లతాం
త నికృంతం బొనరింప వచ్చునెడ ధన్యత్వమ్ము భావించి ప్రీ
తిని బూసెజ్జల రాలు నా సుమతతుల్ దివ్యంబులే తత్కృతుల్. 4

స్వచ్ఛతయు లేక నిస్స్వార్థపరత లేక
కాంతి దాంతియు లేక కర్కశత మెలఁగు

నరులకంటెను బూజ్యముల్ విడులు తలఁపఁ
గాననే వానిఁదలఁదాల్పఁగంట సతులు. 5

అందు వసంతకాలమె నిరంతరమున్ సుమనోనుకూలమౌ,
విందులు గూర్చు వీనులకు విశ్రుతిఁగోకిలబృందముల్, మహా
నంద మొసంగు నృత్యముల నమ్ములు, కీరసమూహ మెల్ల ధై
నందినమున్ బఠించు శ్రుతి నమ్రత చూపుచు మౌనిజాతికిన్. 6

జాతివైరంబు లెఱుఁగ వచ్చటి మృగములు
మాంసభోజన మొల్లవు, మాయకాని
మర్మమును గాని యెఱుఁగవు, మౌనితతికి
సేవచేయు మహోన్నతస్థితి వహించి. 7

నగరకల్మషవర్తులౌ నరులకంటె
నడవిలో నున్నమృగములే యధికము లని
నగరముల వీడి పూతవనమ్ములందె
యాశ్రమంబుల నివసించి రార్యఋషులు. 8

ప్రియమౌ నిట్టి నిజాశ్రమంబును మహాప్రీతాత్ముఁడౌచున్ వసి
ష్ఠయమిశ్రేష్ఠుఁడు దివ్యదీధితులతో సౌభాగ్యభాగ్యాన్విత
ప్రియకాంతాతిలకంబుతోడఁ జని చేరెన్ దేవతల్ పుష్పసం
చయవర్షం బొనరింపఁగాఁ బ్రకృతి తేజస్వంతమై యొప్పఁగన్. 9

చిలుకకొలంపు ముత్తవలు చెందొవటేకులదండ లీయఁగో
యిలపువుఁబోండ్లు కెంజిగురు లెల్ల సరంబు లొనర్చి భక్తి నిం
పులు గులుకంగ నీయ మఱి ముద్దుగ బాటలు పాడుచుండ హం
సలు మఱి నమ్మిమొత్తములు చక్కగఁగూర్చె గృహప్రవేశమున్. 10

ఇటు లరుంధతీకాంతతో ఋషివరుండు
స్వీయదివ్యాశ్రమంబును జేరి గార్హ
ధర్మపరిపాలనా వ్రతతత్పరుఁడయి
యుండె నాదర్శభూఁతుఁడై యొరుల కెల్ల. 11

పంచభూతంబులున్ భయభ్రాంతము లయి
వారిసేవాపరత్వంబె కోరుకొనియె;
దివ్యసంసారజీవితదీక్షఁబూను
ధీరవరులకు నెల్ల స్వాధీనమె కద! 12

తనకున్ నిచ్చలు సేవచేయుతెఱఁగుల్ ధన్యాత్ములౌవృద్ధు ల
ర్చనముల్ పొందెడి తీరులున్, మఱియు శిష్యవ్రాతమున్ సాకు నే
ర్పును, గోమాతృపదారవిందభజనంబున్ భూతసంప్రీతియున్
మునిమూర్ధన్యుఁడరుంధతీరమణికిన్ బోధించి సంతుష్టుఁడై. 13

"తరుణి! సంసారదీర్ఘయాత్రాపరులకు
నరయ సులభంబు లౌ నుపాయములు గలవు
శమదమాన్వితధర్మమార్గమును బట్టి
పొందవచ్చు యాత్రానంద మిందువదన! 14

పెంపునఁ దరించి యొరుల దరింపఁజేయ
సారవంతంబు నిజము సంసార మగును;
ఆత్మకుక్షింభరిత్వకామావిల మగు
నీచసంసారమే సర్వనింద్య మగును. 15

అసిధారావ్రతమగు నో
బిసరుహపత్రాక్షి! పరమభీకరపాపా
లస మగు సంసృతి గడచుట
విసమును నమృతంబు నిందు వెలయు లతాంగీ! 16

ధర్మమార్గంబునఁ దవిలి సత్కర్మంబు
లీశ్వరార్పణబుద్ధి నెవఁడు చేయు
తుచ్ఛోపభోగసంతుష్టిఁగాంక్షింపక
యింద్రియనిగ్రహ మెవ్వఁడందు
నియమవ్రతంబుల నిరుపమానంబుగా
నడపించుచుండు నెవ్వఁడు సతంబు
అతిథి దేవుల సేవ యభ్యాగతసపర్యఁ
పరమవ్రతంబుగా జరపు నెవఁడు

వెలయు నాత్మావలోకనవృత్తి నెవఁడు
తనువు మనువును దైవతత్పరత నుంచి
యట్టివానికి సంసార మమృత మగును
కానివానికి విషమగుఁగంబుకంఠి! 17

రెండు విధముల నానంద ముండు నతివ!
ఇంద్రియానంద మొకటి నికృష్టమిదియె
ఇంద్రియాతీతమైన దోఁయిగురుఁబోఁడి!
రెండవది దీని మించిన దొండుఁలేదు. 18

కామవికారముం దగులు కాపురుషుండు వివేకహీనుఁడై
క్షేమముఁ గాంచలేఁడు దరిసింపఁగలేఁడు యథార్థతత్త్వమున్
నీమము నిష్ఠయున్ నిలుప నేర్చినవాఁడె జయించుఁ గామమున్
గామవిజేతయే తలఁపఁగా నగు జ్ఞానవిశిష్టుఁడో చెలీ! 19

సకలవైదికకర్మనికరంబు దీక్షతో
నొనరింపఁగా వలె నువిద! నరుఁడు
కర్మసంత్యాగి కాఁగారాదు నరుఁడెప్డు
గర్మఫలత్యాగి కావలయును
శ్రద్ధయు భక్తి యాచారంబు నిత్యసం
తోషంబు నరులకుఁదోడునీడ
ఆత్మావలోకన మహరహస్తపమును
బ్రహ్మనిష్ఠునిఁజేయుఁ బడఁతి! నరుని

బ్రహ్మనిష్ఠాగరిష్ఠసౌభాగ్య మతివ!
అవని దుర్లభ మెంతవాఁడైనఁగాని
బహుళగతజన్మసుకృతసత్ఫలముకతన
లభ్యమగుఁగోటి కొకని కో లలన! యదియు. 20

బ్రహ్మనిష్ఠులు గాంత్రు శాశ్వతయశస్సు
అవ్యయానందపదము వా రధివసించి
జన్మమృత్యుప్రవాహంబు జాడఁ గనరు
అతివ! యితరులు చెదపుర్వు లట్టివారు. 21

పూతబ్రహ్మకులంబునం బొడమి సంభూతాత్మవిజ్ఞాన వి
ఖ్యాతిం గాంచి జగజ్జనావళికి నత్యంతంబు నాదర్శమౌ
రీతిన్ వర్తిలకున్న లోకము చెడున్ రిక్తప్రయత్నంబగున్
నాతీ! బ్రహ్మకు సృష్టికార్య మిటు కానన్ జేయు మేతత్కృతుల్. 22

తరుణీ! నినుఁజెట్టవట్టి యాదర్శగార్హ
ధర్మనిర్వహణంబునఁ దనర నడుగు
పెట్టినాఁడను సద్గుణప్రేరిత వయి
నడుపు భారంబు నీయది నలిననయన! 23

ఇతఁడొకశిష్యరత్నము మహీస్థలి నొంటిపదంబుపైని ని
ల్చి తపము వేయియేండ్లొనరఁజేసెను సాధ్వి! యితండు భస్మసా
త్కృతు నొనరించి మన్మథుని నీశ్వరుఁబోలి మహోగ్రనిష్ఠ సు
వ్రతుఁడయి వెల్గు నిట్టిగతివారలు మత్ప్రియశిష్యు లో సఖీ! 24

నియతాహారులు నిర్జితేంద్రియులు నిర్నిద్రప్రమోదాన్వితుల్
ప్రియకాంతామణి! శిష్యరత్నములు నిర్లిప్తుల్ భవత్సేవకుల్
ప్రియపుత్రాగ్రణు లట్లు వారికి లసత్ప్రీతిన్ సుమృష్టాన్న స
త్క్రియఁ దుష్టింబొనరించుచుండుము జగద్విఖ్యాతి నొప్పారుచున్".

అని బోధింప నరుంధతీరమణి బ్రహ్మానంద మొప్పార భ
ర్తను సాష్టాంగనమస్కృతిన్ దనిపి శ్రద్ధాభక్తి సంయుక్తయై
వినుతించెన్ "పతిదేవ! నీ దయిన భ్రూవిక్షేపముం బట్టి నీ
కనుసన్నన్ భవదాజ్ఞలన్ నెఱపుదున్ గాపాడ నీ వెప్పుడున్. 26

జగదభ్యర్చిత తావకీనపదసంస్పర్శన్ దదారాధనన్
బొగడొందంగల దేవదేవ! కరుణాపూర్ణుండవై త్వత్కృపా
పగ నాపైఁ బ్రవహింపనిమ్ము మఱి యాపై నేమియుం గోర నిన్
సగుణాకార పరాత్పరప్రభునిగా సమ్యగ్గతిం గొల్చెదన్. 27

నాదగు పూర్వపుణ్యమున నాదగుదివ్యతపఃఫలంబునన్
నీదగు పాదపద్మతతి నిస్తులభక్తిని వ్రాలఁగంటి భా
గ్యోదయ మిద్ది నాకుఁ గరుణోదధి! నీ కడఁగంటిచూడ్కి యా
హ్లాదపరంపరావహము నవ్యయసౌఖ్యనిధానమున్ ప్రభూ! 28

కొలుచుకొందును నీపాదజలరుహములు
తలఁచుకొందును నీ నామతారకంబు
నడచుకొందును నీదగు నడుగుజాడ
నిలుచుకొందును నీదు నిశ్చలమనంబు. 29

ఎఱుఁగుదు నీమహత్త్వము ఋషీశ్వర! తావకపాదపద్మముల్
మఱఁగి చరింపఁగందుఁ బరమంబగుకీర్తిని జూఱఁగొందు రూ
పఱ సకలాఘముల్ పరమహంస! నినుం గవగూడి హంసినై
నెఱపుదు జీవితాబ్దిని ననింద్యవిహార మనంతకాలమున్. 30

పరమపావన సద్బ్రహ్మపథవిహార!
భవము భవమున నేను దపం బొనర్చి
కాంచఁగంటిని భవదీయకరుణ నిట్లు
శాశ్వతం బగు నీ కటాక్షంబు దేవ! 31

తల్లియుఁదండ్రియున్ గురుఁడు దైవము సర్వము నీవె యంచు నా
యుల్లమునం దలంచుచు మహోత్తమభంగి నొనర్చుచుందు సం
ధిల్ల మనః క్రియైక్యము వినిర్మలవాక్సముదంచితంబుగా
వల్లభ! నీసపర్యలు భవత్ప్రియపత్నిగ శాశ్వతంబుగన్. 32

తలఁపఁగ మూఁడులోకముల దంపతులందు నరుంధతీ వసి
ష్ఠులె కడు మేలుబంతు లని సూరిజగంబుల శాశ్వతంబుగా
నెలకొనుఁగాక దివ్యము ననింద్యము నైన యశోలతాంగి త
ద్విలసిత తావకీన సుపవిత్రమనోబ్జము జృంభితంబుగన్. 33

లలనలకు జీవితేశ్వర లాలనంబె
పరమపదముగదా! దేవ! పావన త్వ
దీయకరుణాకటాక్షసందీప్తి సోఁకఁ
దేలియాడుదు నానందదివ్యవార్ధి. 34

పతి కటాక్షింప నేపాటియతిపయ్యెనఁ
గాంచు నసదృశశక్తులు, కాంతుఁడహహ!
పరమయోగీశ్వరేశ్వరప్రభుఁడె యైన
నతనియాలి మహాభాగ్య మలఁతియె? ప్రభు!" 35

అని పలుకన్ వసిష్ఠుఁడు మహర్షివిభుండెద సంతసించి యా
మెను బ్రియవాక్యసంపదల మిక్కిలి లాలనచేసి యాపయిన్
వినుతగతిన్ దొడంగె నతిభీకరమైనతపం బొనర్ప భో
జనమును నీరు నిద్రయును సర్వము వీడి మహావ్రతస్థుఁడై. 36

సహధర్మవ్రతచర్యకున్ దొడఁగె నాఁసాధ్వీమహారత్నమున్
మహనీయం బగురీతి భర్తృపదపద్మస్ఫారసంసక్తి దు..
స్పృహ దీక్షం గొని దాంతిఁ బూనియుఁదపస్తప్తాంగియై యామె ప్ర
త్యహమున్ భర్తృతపోనవద్యతకుఁ బ్రత్యక్షప్రమాణం బనన్. 37

నవలావణ్యవిలాసహాసములు చెన్నారంగ నొప్పారి సం
స్తవనీయంబగు యౌవనంబున మహాసౌందర్య సంశోభులౌ
ధవులం గూడి రహః క్రియాకలన మోదప్రాప్తి నున్మత్తలౌ
ట వరింతు ర్సతు లింతెకాని యిటు లుంటల్ లోకసామాన్యమే?

నిత్యోపవాస వినిర్మలదీక్షలే
షడ్రసోపేత భోజనము గాఁగ
బహిరింద్రియవ్యాప్తి పరిహరణంబె సం
భోగానుభవ సుఖస్ఫూర్తి గాఁగ
శీతవాతాతపశ్రేణి నుదాసీన
భావమే విజయభావంబు గాఁగ
నిశ్చంచలధ్యాననిహితచిత్తమె సక
లేప్సితార్థమహాభిహితము గాఁగ

దివ్యదంపతు లగువారిదీక్షవలన
దశదిశలు దివ్యతేజఃప్రదములు గాఁగ
తొలుత హిమగిరితనయతోఁదుహినధాత్రి
శివుఁడు పొల్చినరీతి వసిష్ఠుఁడొప్పె. 39

పలుకఁడేమియుఁ; జేఁతఁజూపఁడు వలసిన
వస్తువుల ఁగనుసన్నలఁ బఱపఁ; డైన
నెటులు గ్రహియించెడిదొకాని యెల్లయవియుఁ
దటికిఁ గూర్చెడు నా యరుంధతి క్షణమున. 40

నిలిచినకాలనే నిలిచి నిస్తులమ్మైన తపంబు పెంపునన్
సలలితబాలభానుగతిఁ జక్కనికాంతులు గ్రక్కు నొక్కటన్
బులకిత దేహుఁడై పరమపూరుషు భక్తిని రక్తి వేద భా
షల నుతియించు నొక్కటఁ బ్రశాంతి వసిష్ఠమహర్షి నిచ్చలున్.

జలదగంభీర నినదంబు నవదరించి
యతఁడొనర్చెడు వేదసంస్తుతులు వినఁగ
దిశ లదరు రోదసియు నిండు దివియు భువియు
దద్దఱిల్లఁగ బ్రహ్మనాదము జనించు. 42

ఆనందంబున నాతఁడట్లొనరఁజేయన్ బ్రహ్మనాదంబు ది
వ్యానందంబున నాశ్రమస్థలసమస్తావకాశంబు పెం
పూనున్ దివ్యశమప్రశోభితమునై యొక్కుమ్మడిన్ జీవసం
తానంబుల్ లయఁగల్గు నాదమున కానందమ్ముతోఁ జక్కఁగన్.

ఆ నాదము మేదురమ్మై
కానన మొనరించు బ్రహ్మకాననముగ ది
వ్యానందులు వారే బ్ర
హ్మానందులు వారె యనఁగ నఖిలమునందున్. 44

అమృతంబుఁ ద్రావ లే దనశనవ్రతమున
క్షుత్పిపాసలఁ ద్రోలఁ జూచె నెట్లు?
కాయకల్పము లేదు కమనీయ విగ్రహ
దివ్యదీధితిని జెందినది యెట్లు?
సిద్ధౌషధాదులు సేవింపనే లేదు
దేహబలంబుఁ జెందినది యెట్లు?
మాయ మంత్రంబుల మఱఁగినదే లేదు
సర్వశక్తులు గాంచఁజాలె నెట్లు?
ఒక్కమానవుఁడయ్యుఁదా నక్కజముగ
నందె నెట్లు మహామహిమాదికంబు?
అనుచు నివ్వెఱపడి వేల్పు లభినుతింతు
రా వసిష్ఠుని బ్రహ్మ తేజో విశిష్టు. 45

ఆ నుతదీక్షలోఁగలమహత్త్వము మెచ్చి యెడంద నందినీ
ధేనువు చేరవచ్చి వినుతించె "వసిష్ఠ! మహర్షిచంద్ర! వ
త్సా! నిను మెచ్చి నీ కతిముదం బొదవింపఁగ వచ్చియుంటి నీ
దానను నేను నీ కిఁక సదా యొదవించెద సర్వసిద్ధులున్. 46

తలఁచినది తత్క్షణంబ సంతసముతోడ
నీకు సమకూర్చుచుండు మౌనీ! యసాధ్య
మేదియును గాదు దివిఁ గల్పవృక్షములును
మఱియుఁజింతామణియును నామాత్ర గావు. 47

ఎవఁడు బ్రహ్మర్షిచంద్రుఁడై యెసఁగుచుండు
నతఁడె లోకసంరక్షణ మాచరించు
నట్టి యాతనికడనుండ నభిమతంబు
వచ్చితి వసిష్ఠ! నీవట్టివాఁడ వౌట." 48

అని పల్కన్ విని సంతసంబున వసిష్ఠారుంధతుల్ భక్తి పెం
పున గోమాతకు సప్రదక్షిణముగా మ్రొక్కులు లేతెంచి "ఓ
జననీ! నీకృప కిట్లు పాత్రులము వాత్సల్యంబు పాటించి మా
కనుకూలంబుగఁజేయు మెల్లవియు నంబా! నీకుఁ గై మోడుపుల్.

తల్లివి నీవు లోకములతల్లికిసైతము నందినీ! కృపన్
జల్లనిచూపు చూచినను జాలును లోకము లుల్లసిల్లు సం
ధిల్లు శుభంబు లెల్ల భవదీయశరీరమె సర్వలోక సం
పల్లలనాత్మకం బమృతపానము నిన్ గనులారఁజూచుటల్. 50

మాకు వలసిన దేమి యమ్మా! తలంపఁ
దల్లి! నీవిట్లు వచ్చితి దయదలిర్ప
వలసినప్పుడు తలఁతుము వచ్చి నీవు
మేలు సంధింపుమమ్మ! మ మ్మేలుకొమ్మ." 51

అని భక్తిన్ వినుతించుదంపతుల నత్యంతంబు దీవించి స
జ్జనమందారము కామధేనువు తథాస్తంచున్ యథేచ్ఛంబుగాఁ
జనియెన్; పిమ్మట మౌనిదంపతులు నిష్కామ్యాత్ములై దివ్యదీ
క్షను బెంపారి యొనర్పఁబూనిరి తపస్సున్ దీవ్రమార్గంబునన్.

ఒడయల కొడయఁడౌ నొడయనిఁ దలపోసి
యొడఁ లెఱుంగనియట్టి యొడమిఁ గనిరి
చూచుచుండియుఁ దాము చూడనిచూపును
జూడక చూచెడిచూపుఁ గనిరి

ఎలుకల కెలుక యౌ౯ నెలుకను గడియించి
యెలుకపుట్టువులుగా నెలుఁగుకొనిరి
చేయక చేసియుఁజేసియుఁ జేయని
చేఁతలలో జగజెట్టు లైరి
వేనకును వేలు చట్టులై వెలయు నట్టి
గొప్పజడదారి గుంపుల కెప్పు డెలుక
చూఱయిచ్చుచు ఁజుబ్బనచూఱ గాఁగ
బ్రతుకుమెలఁకువ లెఱిఁగి జంపతులు మనిరి. 53

ఒకవంకఁ బతిదేవు నకలంకపరిచర్యఁ
దనుపుచుండును దానుఁ దనియుచుండు
నొకవంకఁవ్రతపూర్తి సుకముగా నొనరించు
మునులకు నమృతాన్నముల నొసంగు
నొకవంకఁ దేవతాదికపూజకైఁసుమ
ప్రకరంబు వివిధపత్త్రికలఁగూర్చు
నొకవంకఁవ్రతముల సుకుమారదేహంబు
కృశముగాఁగను దపఃప్రశమ మందు
ఆశ్రమప్రాంగణంబున నలరు పుత్త్ర
సదృశ మగు జంతుకోటి భిక్షములఁ దనుపు
నొక్కవంక, నరుంధతి పెక్కుగతుల
భువనకల్యాణి యగుచుఁగాపురము నేయు. 54

అమలతపోగ్ని మధ్యంబున వెలుఁగుచు
రెండవబ్రహ్మనా నుండుచుండి
తనధర్మపత్నీ యుత్తమసేవ చేయుచు
నుండఁజూడనియట్లు లుండుచుండి

తనశిష్యగణము దర్శనమాత్రచేతనే
ధన్యులఁజేయుచుఁదనరుచుండి
తనదివ్యతేజ మా యనలేందు రవిమయూ
ఖముల నోడింపఁగఁగ్రాలుచుండి
వాయుభక్షణ సాత్త్వికబలముఁ బడసి
నిత్యసంతృప్తుఁడై తానె నిఖిలజగము
నిఖిలజగమును దా నను నిజ మెఱింగి
వఱలుచుండు వసిష్ఠదేవప్రభుండు. 55

అతని మహత్త్వముం దెలిసి యచ్చెరువంది మహేశ్వరుండు శా
శ్వతమహిమాస్పదం బఖిలశాసకశాసనదక్షమున్ మహో
న్నత మగు బ్రహ్మయష్టిని ముదంబున బంపెను వచ్చిచేరె సం
తత పరిరక్షకం బగుచుఁదా నది యప్పురమర్షిచెంతకున్. 56

మునిమూర్ధన్యుఁడు తనయం
గనతో భయభక్తియుక్తిగౌరవముల న
వ్వినుతం బగుయష్టిబ్రద
క్షిణ మొనరించి కేలఁ గీలించె వెసన్. 57

పాశుపతిచేతిశూలంబుపగిది, విష్ణు
కరకమలమందు వెలుఁగుచక్రంబు భంగి,
తగ మహేంద్రుని వజ్రాయుధంబు గతిని
బ్రహ్మయష్టి యొప్పును మునిప్రవరుచేత. 58

ఆదిసరస్వతీసహితుఁడైన విరించి మునీంద్రు మెచ్చి తా
నాదరమేదురంబుగను నక్షసరంబును బంపె బంపఁగా

మేదురకాంతిపుంజముల మీఁదిఁకి జిమ్ముచు వచ్చి యద్ది స
మ్మోదముఁ గూర్పఁ జేరి మునిముఖ్యు వసిష్ఠ మహాప్రదీపునిన్. 59

మునిమూర్ధన్యుఁడు భక్తిమ్రొక్కి పరమామోదంబునం జేతఁ గై
కొని నేత్రంబుల కద్దికొంచు శుచియై, ఘోరాఘసంతానముల్
కని దౌ దవ్వులనుండి పాఱఁగ జగత్కల్యాణదం బై యవి
ద్యను నాశం బొనరించు నక్షసరమున్ దాల్చెన్మహోత్సాహియై. 60

ఇభవరదుమెడ నుండు కౌస్తుభ మనంగ
శివుని మెడలోని పునుకల చేరనంగ
వెలయుచుండె వసిష్ఠునిగళమునందుఁ
బరమరుద్రాక్షమాలికావరము మిగుల. 61

కరివరదుఁడైన విష్ణుఁడు గారవమున
మునిశిరోమణి కనిపె నమోఘమైన
మేలిబంగారుతోడ నిర్మితము నయిన
యొక కమండలువును మహిమోన్నతంబు. 62

పరమవినీతిఁ గైకొనె గృపాపరతంత్రుని విష్ణుఁగొల్చి యా
పరమమునీంద్రుఁడట్లమృతవారిని నింపినకుండి భక్తితో,
కరుణవహించి యా ఋషిశిఖామణి యందలి నీరుచల్ల స
త్వరశుభమౌను. గోపమున వారిని జల్లఁగ సర్వనాశమౌ. 63

కామ్య మెఱుఁగని యా ఋషిగ్రామణి యిటు
కరుణఁ బడసి త్రిమూర్తుల వరము లందె
దివ్యమహిమాభిరాముఁడై తేజరిల్లె
సాధ్వియైన యరుంధతి సహచరింప. 64

పిదప నరుంధతీరమణి పెంపును సొంపు పతివ్రతాత్వసం
పద గురు బోధమున్ బరమమంగళరూపము మెచ్చి యిచ్చులన్
త్రిదశపతివ్రతామణులు దీవనలన్ శచి దివ్యగంధ మా
ల్యద మగు రత్న పేటికయు నంపి రరుంధతికిన్ బ్రియంబుగన్. 65

రమయున్ బార్వతియున్ సరస్వతియు నారామామణిన్ మెచ్చి యు
త్తమసాధ్వీతిలకం బరుంధతిని సందర్శించి సౌభాగ్య భా
గ్యము నిత్యోజ్జ్వల యౌవనంబు సుకుమారాకారమున్ సర్వసౌ
ఖ్యము లందం గల శక్తి నిచ్చి చని రత్యంతప్రమోదాత్మలై. 66

నవయౌవనసౌందర్యం
బవయవములఁ జిందులాడ నతిభక్తిమెయిన్
ధవునకు మ్రొక్క నరుంధతి
నవయౌవన మందె నతఁ డనంతద్యుతులన్. 67

దైవబలంబును మఱి వి
ద్యావిభవము జ్ఞానసంపదన్ గాంచి తప
శ్శ్రీవైభవ సంయుతులై
సేవించి రరుంధతీ వసిష్ఠులు గృహితన్. 68

పెక్కురు చక్రవర్తులకుఁ బెక్కురురాజులకున్ మహీస్థలిన్
బెక్కురుఁరాజవంశ్యులకుఁబ్రీతి గురుండు పురోహితుండు నై
మక్కువ నాదరించుచు నమానుషభంగిని వారిఁ బ్రోచుచున్
నిక్క పుదైవమ్మై నెగడి నిస్తులకీర్తి వసిష్ఠుఁడందఁగన్. 69

భూజనులు సుఖం బుండిరి
రాజులు ధర్మాత్ములై విరాజిలిరి మునుల్
పూజితు లైరి జగంబున
సౌజన్యమెఁవెల్లివిరిసె సంభావ్యముగన్. 70

ఒక్కమహర్షివర్యుఁడు మహోన్నతదివ్యతపస్య నుండఁగాఁ
బెక్కురు సౌఖ్య మందు టది పెద్దయె! రాత్రి విహాయసంబునం
దొక్కఁడు రోహిణీప్రియుఁడు జ్యోత్స్న విరాజిలుచుండువేళబెం
పెక్కదె లోక? మట్లె రవి వెల్గ దినంబునఁబొంగరే జనుల్?

ఇంద్రాదిఁదివిజనుత రా
జేంద్రులు పత్నులను గూడి యిష్టార్థములన్
సాంద్రత నందఁగ వచ్చి ము
నీంద్రుని సతిఁగొల్చి పోదు రిష్టావాప్తిన్. 72

రాజు చెడి రాజ్య మెల్ల న
రాజక మగువేళఁదానె రాజయి రాజ్య
శ్రీ జెట్టవట్టఁ బ్రజ లే
యోజను జెడకుండఁ బ్రోచుచుండును ఋషియే. 73

రాజసంతతిలో గుణరాజితుఁ డగు
క్షత్త్రవీరుని కారాజ్యసంపద నిడి
మగిడి వచ్చును రాజ్యమమత్వ మింత
యైన లేక వసిష్ఠమహర్షి పనికి. 74

కంటికి ఱెప్పవోలెఁ బ్రజ గాచుచుఁ దంఁడ్రివిధాన నెప్డు, త
న్నంటఁ గనీక రాజసనుఖాశ లవంబును లోకసంగ్రహం
బొంటి నొనర్చు చుండి మహిమోన్నతి వెల్గువసిష్ఠమౌని ము
క్కంటి విధానఁదాను, దనకాంతను గూడి జగద్ధితార్థియై. 75

అలఘుతపస్వు లైన మును లందఱుఁ బత్నులతో నరుంధతీ
లలన వసిష్ఠునిన్ గన సలక్షణభక్తి నరుంధతీవసి
ష్ఠుల సుకృతాశ్రమంబున విశుద్ధతపః ఫల మంద వచ్చి వా
రలఁ పరిచర్యలన్ మిగుల రంజిలి పోదురు భక్తిఁ గొల్చుచున్.

ఈ రీతిన్ విలసిల్లుచుండిన మహర్షీంద్రుండు తా నాత్మలో
నారీరత్న మరుంధతీరమణిసౌందర్యంబు వీక్షించి సం
సారప్రస్ఫుటసత్ఫలం బొసఁగఁగా సంకల్పముం బూని య
స్నీ రేజాసనునాజ్ఞనుం దలఁచి ముగ్దెన్ రాగవారాన్నిధిన్. 77

పతి యనురాగదృష్టి సతిపైఁబడ నంతటిదాక నిట్టిసం
గతి యపురూప మశ్రుత మకాండశుభం బని యెంచుకాంత క
ప్రతిమముగా జనించె ననురాగము రాగముయాత్మలైన దం
పతులకుఁదోడ్పడెన్ మదనపండితుఁ డెంతయు భక్తియుక్తులన్.

త్రికరణశుద్ధాత్ములు స
ర్వకళాబహుపారదృశ్వవర్యులు వారల్
త్రికరణములు నేకముగా
సకలశుభముహూర్తవేళఁ జలిపిరి కేళుల్. 79

తాపసరాజ్యంబును మఱి
భూపాలుర రాజ్యలాభముం బొందిన యా
తాపసదంపతు లందిరి
తాపాదికనిలయ మౌ మదనరాజ్యంబున్. 80

తపమున ధర్మబోధమునఁ దత్త్వమునన్ గడుదిట్ట కల్పపా
దపము నిజాశ్రితాళి కని తా రమణీమణి మున్నెఱుంగుఁ గా
ని పతిని గామతంత్రముల నిస్తులుఁడున్నిపుణుం డటంచుఁ దా
నెపుడు నెఱుంగదౌర! యిది యెంత పరాత్పరుఁడా మహర్షికిన్.

పరమపతివ్రతామణి యపారతపోధికశోభితాంగి సుం
దరి సుగుణాకరం బనియె తాపసి పత్ని నెఱుంగుఁగాని త
త్పరమరహఃక్రియానిపుణతల్ మును గాంచి యెఱుంగఁడిప్పుడో
పరవశులైరి దంపతులు భవ్యపరస్పరశాస్త్రవిజ్ఞతన్. 82

స్త్రీపశువు పురుషపశువును
జేపడి సంసారవృద్ధి చేయుట లేదా?
యేపగిది భేద మేర్పడు
నా పసులకు మానవులకు? నరయన్ వలదే? 83

నియమవిహీనులై పరమనింద్యత నిగ్రహ మింతలేక యా
మయముల కాలవాల మయి మారశిలీముఖదష్టచిత్తులై
వయసు వృథాయొనర్చు నరవర్గమె యౌఁ బశువర్గ! మిట్టి దు
ష్క్రియులకు నిగ్రహాత్ములు ఋషీశులకున్ గట! పోల్కి యున్నదే?

నిరుపమయౌవనంబు నతినిష్ఠుర నిగ్రహనిశ్చలాత్మలన్
బరమశివాంకితంబుగఁదపఃక్రియలందు వ్యయించి యీశ్వరే
శ్వర పరిపూర్ణసత్కృపకుఁ బాత్రులు దివ్యులునై తదాజ్ఞచే
వరసుతులన్ గనంగ భయభక్తి రమించుట యెంత భాగ్యమో!

ఆ వసిష్ఠుఁడరుంధతి నట్లు కూడ
బూవు దావియుఁ గలసినపొలుపు వెలసె
సౌరభం బబ్బె మేల్మిబంగారమునకు
ననఁగ ఁదోఁచెను లోకంబు లలరె దాన. 86

పుణ్యతా ర్తీయపురుషార్థమును భజించి
యుల్లసిల్లి రరుంధతీవల్లభు లిటు
కొన్ని వేలేండ్లు వారలకూటమిని జ
నించె సుతశత మఖిలమునిప్రవరము. 87

తొలుతన్ బుట్టినపుత్త్ర రత్నము జగత్ స్తుత్యుండు శక్తర్షి య
య్యలఘుబ్రహ్మమునీంద్రుఁడొప్పసగిభార్యారత్నముంగాంచి యా
లలనారత్నమునన్ బరాశరుఁదపోలక్ష్మి యుతున్ గాంచఁగన్
విలసిల్లెన్ ఋషివంశముల్ క్రమముగా విఖ్యాతవాసిష్ఠముల్.

పిదపం బుట్టిన పుత్త్రు లెల్లరుఁ దపోవీరుల్ మహాభావులై
యుదితార్కోపమతేజులై వెలసి రీయుర్విన్ ఋషీంద్రావలిన్
సదసద్భేదవివేకులై చతురులై జ్ఞానప్రవిష్టాత్ములై
పొదలం జేసిరి వంశవర్ధనము నంభోరాశిచందంబునన్. 89

క్షడుపుచల్లనితల్లియై క్రాలె నిట్లు
భువి నరుంధతి లోకైకపుణ్యసాధ్వి
మఱి వసిష్ఠుఁడుఁ బిదప నమ్మాన్యుఁగూడి
తనరుచుండె వానప్రస్థధర్మరతిని. 90

జగదాశ్చర్యకరంబు లైన కృతులన్ సమ్యగ్గతిం వేన వే
లుగ నాతం డొనరించెఁ బేర్కొనఁగఁజాలున్ శేషుఁడో లేక స
ర్వగరిష్ఠప్రతిభావిశేషుఁడెవఁడో బ్రహ్మాండనాథుండు. నే
యుగమం దన్యుఁడెవండు బేర్కొనగలేఁడోహో! వసిష్ఠోన్నతుల్.

నిమిశాపము విశ్వామి
త్రమునిపరాజయంబు ఋషివతంసులప్రోపున్
అమలినరామగురుత్వము
సముపాస్యము లతని కోటిసత్కృతులందున్. 92

ఒక దివ్యనదీతీరము
నకుఁ జని ముని, యాలునున్ వినమ్రతఁ గొలువన్
వికచహృదయాంబుజుండై
యొకయాశ్రమమందుఁబుచ్చుచుండె దినంబుల్. 93

ఆ నది కావలియొడ్డున
మౌనిమణి యగస్త్యుడుత్తమవ్రతదీక్షా
నూనుండై యేకాకిగ
మానితముగ వాయుభక్ష్యమాత్ర వసించున్. 94

అమలవసిష్ఠమౌనియు నరుంధతితోడ నదిన్ దరించి పో
యి మహితదీక్ష నున్న పరమేశ్వరరూపు నగస్త్యుఁ జూచి త
ద్విమలపదాంబుజంబులకుఁ బ్రీతిని మ్రొక్కి సభార్యుఁడై వడిన్
సుమహితపూజ చేసి తముఁజూచిన మౌనికి భక్తి నిట్లనున్.

"సహుషహుంకారి! నీదుమౌనవ్రతంబుఁ
జెలుపఁదలఁపము మముఁ గటాక్షించి మేము
నిత్య మొసఁగుఁ నాతిథ్యమున్ స్వీకరింపు
మవలియొడ్డునఁ గలమయ్య!" యన నతండు. 96

జగదభ్యర్చితులౌ నరుంధతి వసిష్ఠబ్రహ్మ యి ట్లేఁగుదెం
చి గరిష్ఠం బగుపూజచేసి యడుగన్ సిద్ధంబె కా కన్య మె
ట్టిగతిన్ బల్కుదు నంచు లోఁదలఁచి యట్లే నాఁగ నూపెన్ దలన్
మగువన్ గూడి వసిష్ఠుఁడున్ మరలె బ్రహ్మానందియై యింటికిన్.

అది మొదలు దినదినంబును
సుదతి యరుంధతి వసిష్ఠచోదితయై పెం
పొదవఁగ షడ్రససంయుత
పదార్థములు చేసి మునికి భక్తిని బెట్టున్. 98

పెట్టిన యాపదార్థములఁబ్రీతిని గొన్నిటి గొంచు మౌనిస
ద్రూట్టు భుజింపఁ బిమ్మట నమస్కృతిఁదత్పరిభుక్త శేషమున్
గుట్టుగ నా యరుంధతి యకుంఠితభక్తిని నిల్లు చేర్చి తాఁ
బెట్టును భర్తకున్ బిదపఁ బ్రీతిఁ గొనున్ బతిభుక్తశేషమున్. 99

మునులకు నెల్లబెద్ద లయి పూజ్యుల కెల్లను బూజనీయులై
యనుపమ విజ్ఞు లయ్యు నహహా! పరిపాటి సపర్యచేయఁగా
మునులకుఁ గోరుకొంౘ్రదు బహుపూజ్యుల కెన్నఁడు గర్వముండునే?
ఘనులకుఁ బూజ్యుఁడౌనతిథి కన్పడుకంటెను భాగ్యమున్నదే? 100

అనుదిన మిట్లు చేయుచు గృహస్థమహోత్తమధర్మకర్మ మ
త్యనుపమదీక్షతో నతిథి యారయ దైవమె యంచుఁ గొల్చుచున్
మునికులముఖ్యుడున్ వినయభూషణుఁడైన వసిష్ఠమౌనియున్
వనితలకున్ శిరోమణి యనందగునాతనిపత్ని యుండఁగన్. 101

ఒకదిన మి ట్లరుంధతి మహోత్తమసంయమి యౌ నగస్త్యమౌ
నికిఁ దనయాతిథేయమును నిస్తులభక్తి గ్రహించి పోవువే
ళకు నది పొంగి పాఱుచుఁ జలంబున నొడ్డులు డాయ దాఁట నే
రక వెనుదిర్గి వచ్చి మునిరాజు వసిష్ఠున కెల్లఁజెప్పినన్. 102

"తరుణీ! యోడకనీవు వేగిరమె పోయి
మనవి యొనరింపు మానదీమాతతోడ
నను సదాబ్రహ్మచారి పంపెను గటాక్ష
వీక్షణంబునఁ దెరువిమ్ము వేగ ననుచు. 103

తెరు విచ్చును నీ కానది
వరనియమవ్రతుల కడ్డువచ్చుట కెపు డె
వ్వరు నోపరు చని రమ్మని
పరమర్షి వసిష్ఠుఁడంప వనితయుఁ బ్రీతిన్. 104

హృదయమునం గుతూహలము హెచ్చఁగ వేగిర మేఁగుదెంచి యా
నదికిని మ్రొక్కి, భక్తిఁ దననాథుఁడు చెప్పినరీతిఁ బల్కగా

ముదమున దారియిచ్చి నది పొమ్మని పల్కిన సంతసంబుతోఁ
బదపడి యామె పోయెఁ బదపద్మములన్ దడి యంటకుండఁగన్. 105

ఆమె కడచని యరిగినయంత నదియుఁ
గడుభయంకర మైనవేగంబుతోడఁ
బాఱఁ దొడఁగెను సుడులతోఁ బ్రాభవమున
నెవ్వ రేఁక నన్ను వారింప నిల ననంగ. 106

కడువడి నాయరుంధతి యగస్త్యునిపాలికి నేఁగి భక్తితో
గుడువఁగఁ బెట్టి యోగిరము కొందలమందుచు "దేవ! యెట్లు నె
వ్వడి ప్రవహించునీనదిని వైళము దాఁటుదుఁ జెప్పు"డన్న న
ప్పుడు ముని మౌనమున్ విడిచి "ముందెటువచ్చితివమ్మ! చెప్పుమా!"

అని యడుగ నరుంధతి భ
క్తిని దెల్పెను భర్త తనకుఁదెలిపినరీతిన్
మునియును జిఱు నవ్వొలయఁగ
ననియెన్ సమ్మదముతోడ నయ్యంగనకున్. 108

"ఉవిద! పల్కుము నిన్ను నిత్యోపవాసి
పంపినాఁడని యానది పాయయిచ్చుఁ
దన్వి! యడుగులు తడిగాక దాఁటఁగలవు
నిన్ను వారింపఁ గలవస్తువున్నె? జగతి." 109

అని పలికిన మునిపత్నియు
ననుపమ మగుభక్తి మ్రొక్కి యాతని కరిగెన్

మును వచ్చినత్రోవనె వ
చ్చినఁ బొంగుచు నుండె నది విశేషత్వరతోన్. 110

కరములు మోడ్చి మ్రొక్కి మునికాంత నదీప్రియమాతకున్ భయం
కరముగఁ బారుచుండఁగ నగస్త్యుఁడు పల్కినపల్కుపల్క న
చ్చెరువుగఁ దత్క్షణంబె నది చిత్రముగాఁదెరువిచ్చి పొమ్మనన్
పరమఋషీంద్రపత్ని పదపద్మము వాడక వచ్చె నింటికిన్.

అతిథిభుక్తాన్న శేషంబు నతిముదమున
భర్తకును బెట్టి భుజియించువఱకు నుండి
అతనిభుక్తాన్న శేషంబు నమృతమట్లు
కుడిచె నప్పు డరుంధతి కూర్మి మీఱ. 112

మనమున నాటియచ్చెరువుమాటలభావ మెఱుంగఁగోరి యా
వనిత యనంతరంబు పతిపాదము లొత్తెడివేళ భక్తి పెం
పున సుముఖాత్ముఁడైన మునిపుంగవు నిట్లడిగెన్ "మహాత్మ! నా
కును దెలుపంగదే ప్రియముఁ గూర్పఁగఁ గల్గిన సంశయార్థముల్.

పరమేశ! మనకు నూర్వురుపుత్రు లెటు సదా
బ్రహ్మచారివి నీవు! పరమచిత్ర
మిది విని నది తెరు విచ్చుట మఱీ చిత్ర
మీచిత్రమును మించు నింక నేను

నిత్యంబు నన్నాది నియతిఁ బెట్టఁగఁ దిను
నతిథి నిత్యోపవాసిత తలంప
నిది విని నది తెరు విచ్చు టింకొకచిత్ర
మీచిత్రపరమార్థ మెఱుఁగఁజెపుమ
అనినఁ జిఱునవ్వు మెఱయఁ దదాననమున
"గాంత! యిట్టివ ధర్మసూక్ష్మములు వీనిఁ
దెలియుదురు మాదృశులు ఋషుల్ తెలియ రన్యు
లిది యెటింగింతు వినుము నీ వించుఁబోణి! 114

ఋతుకాలమున నాత్మసతిఁ గూడి పెఱయప్లు
భ్రాంతిహీనుఁడు సదా బ్రహ్మచారి
యశన మబ్బకయున్న నబ్బిన సమముగా
నుండునాతండు నిత్యోపవాసి
మనలఁ గటాక్షింప మనయాతిథేయంబుఁ
గొనుఁ గాని వాయుభక్షుం డతండు
కావున నింతటి గౌరవం బేర్పడె
మామాటలకుఁ దన్వి మహి" ననంగ

మిగుల నాశ్చర్యముం జెంది మించుఁబోడి
యగునరుంధతి మఱియింత యాదరమున
నతిథి సేవయుఁ బతిసేవ యాచరించి
శాశ్వతయశస్సు గడియించె జగతియందు. 115

తమపాదధూళి కొంచెము సోఁకిననుగాని
యఖిలంబుఁ బావనంబై తలిర్ప
తమ్ము సమ్మానించి దర్శించుజనము ల
త్యఘదూరు లగుచు దివ్యత గడింప

తమ యనుగ్రహముఁ గొంచెముఁ గాంచువారైన
  దివ్యభోగంబులఁ దేలుచుండ
త మ్ముపాసించుపుణ్యమ్ముఁ గూర్చినవారు
  జ్ఞానులై పరమవిజ్ఞత గడింప
శాశ్వతంబుగఁ బరమనక్షత్రము లయి
మూడుఁలోకము లేలుచుఁ బొలుచుచుందు
రతులితాదర్శదంపతు లయి యరుంధ
తీ వసిష్ఠులు నేఁటికి దివ్యధాత్రి. 116

ఇలను వివాహవేళ సకలేప్సితసిద్ధి కరుంధతీ వసి
ష్ఠులె ఘనసాక్షులుఁ మఱి యశోవిభవప్రదులై యనేక పూ
జలఁ గొనుచుఁ వధూవరుల సంతతసత్కృపఁబ్రోచుచుంద్రు ని
చ్చలును నుమామహేశ్వర యశస్వులు వా రయి శాశ్వతంబుగన్.117

ఇది యగు నరుంధతీవసిష్ఠీష్టకావ్య
రాజమునఁ దృతీయాశ్వాసరాజ మీశ!
గురువరా! త్వత్కృపామృతభరిత మామ
కీన వాఙ్మయ మిదియు నంకితము నీకు. 118

***

